

# మంగళాచరణము

శ్రీజగన్నాయకుండు రక్షించుఁగాత!
స్వేష్టదేవతాసాహ్యాము హెచ్చుఁగాత!
శ్రీవిజయినీప్రభుత్వముల్ చెలఁగుఁగాత!
నందనాబ్దముకఅవుదే నందుకతన
సౌఖ్యములఁదేలెదరుగాత సకలజనులు!
వర్యమద్వైతబ్రహ్మణ్య వరసుతయగు
శ్రీమహాలక్ష్మమాంబికా ప్రీతుఁడయిన
వావిలాలాన్వయాప్పయ పండితేంద్రు
పుత్రుఁడుద్వితీయుఁడనుభూత పూర్వసాధు
రుక్మిణీసోమిదేవ్యను రుద్ధగుణుఁడు
భవ్యనైష్ఠికశ్రీయడవల్లివంశ్య
వేంకటేశ్వరకామేశ్వరాంకసోమ
యాజిజామాతసత్యవాక్యప్రియుండు
పూర్ణపదమహాలక్ష్మీసు పూజ్యమానుఁ
డగుచునీగ్రంధకర్త విద్యావినీతి
సంపదలుగల్గినిజబంధు సంయుతముగ
వంశవిఖ్యాతియుడివోని వర్తనముల
వెలయుచుండసజ్జనులు దీవింత్రుగాత!

# కృతిప్రశంస.



కాళిదాససరస్వతి మేలిమిగనఁ
గోలగిరిమల్లినాథునిఁ బోలఁగలమె ?
ఐనఁదత్సూరిదత్తనూ ర్గానసాహ
సించితత్కృతులందెల్ల శ్రేష్ఠమనుచుఁ
బొగడికలుగనురఘువంశ పుస్తకమును
దివిరితినిదెనిఁగింపఁగాఁ దేఁటగీతి.
ఇదివెలువడుడుఁదక్కిన మొదటికవుల
కృతులునిటువలెనేతెలిఁ గించితొంటి
కవులయూహాలధోరణిం జవులువుట్టఁ
జేయఁగోరుటనాకెంతో చేతఁగాని
పనియనియెఱింగిమద్గురు పండితులకు
జోఁతలొనరించి యొకచేయి చూతునంటి.



# కృతిపతిపదవి.



నాయకుఁడులేనివిషయంబు నాశమొందు
భాతిఁగృతిపతిలేని ప్రబంధమునకు
నోరుగలవారిమోఁచేతి నీరుద్రావి
యీడిగిలబడిబ్రతుకుట యెట్లుతప్పు ?

ఇంతయెఱుఁగఁ జెబుకొ మహీపతికిని
విప్రసమ్మతిశ్రీయజు ర్వేదభాష్య
మునిడఁదలఁచెవిద్యారణ్య మునివరుండు ?
అరయసంస్కృతమందురా కాగమప్ర
భృతులుప్రభునామధేయ చిహ్నితములయ్యె.
తెలుఁగులోఁగృతియీఁకున్న వెలివఱుతురు.
తారొసంగిరిమునుకవి త్రయమువారు,
మొదటిదారినెద్రొక్కిరి పిదపవారు.

రాజరాజనరేంద్రుని ప్రాపకమున
బ్రదికినన్నయభట్టు తత్ప్రతిభనిలిపె.
మనుమరాజులసత్కీర్తి మనిపికడల
సోమమొనరించెఁదిక్కన సోమయాజి.
నరకృతిప్రియుఁడెఱ్ఱన కరుణఁగాదె
రెడ్డిరాజులుపేర్కొని రిభువిమీఁద ?
రెడ్లకునువారిమంత్రి వరేణ్యులకును
సరిగఁగురిపించె శ్రీనాథుఁ డురుయశస్సు.
నమ్మిమువ్వురుహరిహర నాథుపేర
నంకితముచేసివ్రాసిరి యధికభక్తి.
మనుజకృతియీఁకశ్రీరాము లనుభజించె
"సహజపాండిత్య"ఁడొకఁడుశ్లాఘ్యఫణితి.
గౌరవించెనుబత్తిమై నారసింహు
వెంకటేశచరిత్రలోఁ వెంగమాంబ.

మ్రొక్కి రచియించెఁగుమ్మర మొల్లిగూడ.
శతకములయందు దేవతాకృతులుకఱవె ?
విష్ణుచిత్తీయకారుఁడు వినతిఁదెలచె
నతులనియతిని శ్రీకాకుళాంధ్రదేవు.
కృతియొసంగెనుమారన ప్రియగురుండు
తండ్రియగుతిక్కయజ్వకుఁ దీండ్రమెఱయ.
దేబిరించియుఁదిరుమల దేవరాయ
రామభూషణమూర్తి శ్రీరాముఁగొలిచె.
మనరెకృతిగొనిసాహిణి మారముఖులు ?
కృష్ణరాయలువెలయఁడె కృతిముఖాన
నిందుదయనందఁబెద్దనార్యుండునిల్వ ?
పెక్కుఱునృసింహభూపులు పేర్వడసిరి
పూనికైకొనిముఖ్యసంతానలబ్ధి.
ప్రభులకునుదేవతలకుఁ బ్రబంధములను
మంచికైయొసఁగిరికూచి మంచివారు.
ప్రథితులైరల్లియయ్యల రాజువారు.
ప్రముఖులైరిల్లియూరికరణముగార్లు.
తురకదొరలకుఁగృతులిచ్చి పరువుగనిరి
తెలఁగనార్యుఁడులోనుగాఁ దెలుఁగుకవులు;
కానిచోమాయదెయమీరు ఖాను పేరు ?
కోరెరఘునాథుకృపచేమకూరసుకవి.
ద్వర్థికావ్యములోవిభు త్వార్థ్యులైరి

యాంకపేటినృపుల్ విరూ పాక్షమహీను.
రాజలింగేశ్వరస్వామి రమణమీాఅ
వసుచరిత్రవ్యాఖ్యానంబు వడసెఁగృతిగ.
కృతులకొప్పిరిశ్రీశిష్టు కృష్ణమూర్తి
లక్ష్మణకవులుగౌరన సూక్ష్మబుద్ధి
కందుకూరివడ్డాది నిగమసుసర్ల
పాలెపుత్రిపురానపన్నాలపూండ్ల
వారణాసిచిలంబుదుర్భనిడమర్తి
పంద్రిసత్యవోల్ కల్లూరిబయపునేడి
జగతిశైలనాదెళ్లగుండుగురుజాడ
నూడభూపికొక్కొండ వంశప్రగేయు
లోగిరాలజగన్నాథ నాగయాది
బుధులునరదేవతాంకిత ములుగఁజేసి.
రుక్మవతిపెండ్లిసోమప్ప ప్రొుక్రివ్రాసె.
కృతులలోలబ్ధిలేకని కృతమతులయి
చంద్రరేఖావిలాపాద్య సత్ప్రబంధ
ములఁగవులువ్రాయరేకృతిముఖముగానె?
హర్షపేరిడ్డధావకు నందమునను
హెచ్చులబ్ధికిఁగర్తృత యిచ్చివైచి
పుష్పగిరికవికంకంటి పురుషమణికి
ధన్యుఁడైమించెనుదశావ తారవినుతి:
అందఱెఱుఁగసరస్వతి యమ్మఁబడియె.

శ్రీమహామహోపాధ్యాయచిహ్నితపర
వస్తురంగార్యగురులుఁదత్ప్రథితశిష్య
మౌళిమృత్యుంజయావనీపాలవరులుఁ
గృతులొసంగరెదేవతావితతికిపుడు ?
వత్సమన్వయజాతుఁడు వాసుదేవ
పదమహితుఁడగుశ్రీపర బ్రహ్మశాస్త్రి
యస్మదీయమాతులుఁడు మహాతపస్వి
చాలఁగలసత్కృతులు పరాశక్తికిచ్చి
వంశ్యపండితులకు సమర్పణముచేసి
తుదకునాంగ్లేయవిభుల సంతోషపఱుప
వలసి "వ్యవహారదర్పణ" వ్యాజమునను
రాజధానీప్రభుస్థాన రాజమందు
డాలుకొనుజానుషైరియరు టామసుదొర
గారిపేరటఁగృతయిచ్చి ఘనతవడసె.
ప్రభువులేజాతివారైనఁ బ్రకృతిగుణులు
వినుతిభాజనులగుదురు విబుధులకును:
నాదుపెత్తల్లియాయాంబ నవ్యఫణితి
"వెలఁదికార్మారిపురములో వెలసినట్టి
"బాలమమ్మేలుమద్వైత బ్రహ్మదేవి"
యనుచుజగదీశిపైఁగృతు లనిశమొసఁగె.
కువలయానందమునుదెనుఁ గునను గూర్చి
మమాగారికిఁగృతియిచ్చె రామలింగ

ధీవరుఁడు మొన్నమా మేన బావముఁడి.
రూపకములెల్లఁబతిఁగూడి రూఢికెక్కె.

అధునికులునుబ్రాచీను లందఱిట్లు
కృతులనలరింపసత్పతి హితలఁజేసి
యార్యదర్శితమార్గయి యాసగల్లు
నాకుమార్గముపెడదారి జోఁకయిడునె?
వెనుకవాసి రెడ్డికులోత్థ వేంకటాద్రి
పార్థివుఁడుపాచితముగ సువర్ణనాభ
రజతపాత్రములందు సద్ద్విజవరులకు
భోజనముపెట్టఁదలఁచి నప్పుడుశరించి
భూమివృత్తులుగోల్పోయి పూర్ణనిష్ఠఁ
బెండ్లమునుదానునానేల విడిచిపిదప
వైశ్వదేవంబుచేసిన బ్రహ్మవేత్త
యైనయావేంకటశివావ ధానివంశ
మందుజనియించిసచ్ఛ్రోత్రి యవిధిఁగాంచి
లౌకికప్రభువిద్యఁ బిల్లలకుఁజేర్చి
భూపసన్మాననమునఁ బ్రతాపమెచ్చి
యాశ్రితులనరసినయ సహాయబుద్ధి
శాలిమాతండ్రియప్పయ్య శాస్త్రిపేర,
నంతరులగెలిచినమహా పాసకులగు
నారసింహసుధీమణి గారిపేరఁ
గృతులుగూరిచిముద్రించి యతులశక్తి

యయినజగదీశ్వరునకొక౯ డంకితమ్ము
చేసియున్నాఁడ ; నిపుడిదిజీవనప్ర
దాతకనుమతినర్పించి తగినకొలఁది
మేలువడయంగఁగోరితి. మిత్రభావ
మునను సమయాననాచోట ననుఁగుఁదనము
చూపిమానసతాపము మాపినన్ను
నిలువఁబెట్టినకూరిమి నేయుఁ అకును
నన్నుసంతాపపెట్టని జ్ఞాతులకును
వేఱయొకమంచికృతిదాఁచి పెట్టినాఁడ.
శ్వేతముఖులందుఁగృతియిచ్చువేడ్క లేదె?
కృతిసమర్పించుటలవాటు క్లృప్తముగను.
ఆంగిలోవిద్యగఱపిరి యతివినయము
నెర్పిట్యానరు కెండాలు పార్వదొరలు
పలువు రెఱిఁగిన నోబిలు పాఠశాల
యందుమచిలీపురంబున యందుముందు.
స్లేటనార్డనుథార్నిటన్ కెయినుదొరలు
నప్పుడప్పుడు చదువును జెప్పినారు ;
గానవారినిమఱువ జన్మాననేను
వారిమతబోధనా మదిఁబట్టకున్న.
ఉదరపూర్తికుపాధ్యాయ పదముదొరకెఁ
గరుణఁగర్హాదొరయును మేటాక్ఫునరయు.
మేగ్డొనాల్డుదొరకును నామీఁదదైవ

వశముననపారదయపుట్టి ప్రభవడసితి.
ఈశ్వరానుగ్రహమున బీ. యే. పరీక్ష
లోనబిల్డరుబెక్కు సాయానఁదేలి
కడిమినిగడానిపదకము గడనసేసి
గ్రిగ్గుదొరవారియండను లగ్గుగంటిఁ
గర్మవశతనుమధ్యమ గతులెపట్ట.
అక్కటికమున మేటాక్కఫు చక్కనిదొర
కీడువోకార్చ్రిరక్షింపనాఁడు మొదలు
కూడుసీరలకునువాచి కుందఁబోక
కాలమునునెట్టుచున్నాఁడఁ గఠినదశలు
పట్టిననుబీఁటపెట్టక పరుగువాఱ.
నడుమడేవిడుడంకను నన్నుబహువి
ధములనుబహూకరించి సద్దయనుగొల్పె.
కార్మికేల్ దొరపరువిచ్చి ఘనతనిలిపె.
మేలువడసెదడాక్టరు మిల్లరుదయ.
విల్సనాపట్టునెలియట్టువిలువలేని
జాలిఁజూపుమరుకరుణా శాలులనఁగ.
బాసువేల్జాన్సను మెకెంజిపవరుగ్రహాము
బ్రౌంటుకెల్సాలుపోర్ప్వియస్ ప్రభృతివిభుల
కనికరంబూఁతగానిల్వఁ గల్గుటయ్యె
మిల్లగుమొబర్లిహేమ్నెట్టుమేలుగురియ.
(ఏకవచనంబునంగవి హెచ్చరించు
టెంతొయాచారమనిక్షమి యింపగలరు)

ఇందఱువళక్షుముఖులు నాయందుఁగరుణ
గొలుపనందొకరికిఁగృతిసలుపుటరుదె?

---

## కృతిసమర్పణము.

ఖ్రిష్టమతబోద్ధృసూతి! విశిష్టభూతి!
సకలవిద్యాధికారి! ప్రశస్తసూరి!
ఆశ్రితావనశక్తి! రాజాదృతోక్తి!
లగ్గుపుడుకంగలారు శ్రీగ్రిగ్గుగారు!



సఖ్యాద్యగ్రిమతిగ్మభానునిభ తేజా దేశ్యరత్నా
వహ। ప్రఖ్యాయొగ్యనిక్కృత్తమయ్యో నినుజేరఁ సుప్రప
న్నాత్మకా। ముఖ్యంబేదో కావస్తువద్ది నిరతంబుఁ
వాక్తతిన్నొల్తువే। వేఖ్యాతాసఫలప్రదానముల శ్రీవి
న్యాబ్ధిచికాపాడవే॥

శ్రీజగత్ప్రభ్వికరుణా విశేషమునను
సర్వతోముఖవిద్యాప్రసరణకరణ

దక్షుఁడగు గ్రీస్తుదారకుఁ గృతజ్ఞబుద్ధి
వినయమున దీనిఁ గృతియీయ వేడుకొందు,
ఘనతసుఖము వడయుఁ గాత మాకృతిపతి!
అన్నికడల సౌఖ్య మలముగాత
మనుచుఁ బండితులకు వినతిచేసెడు చెలి

వావిలాల వాసుదేవశాస్త్రి.



శ్రీరస్తు.

# రఘువంశము.

## ప్రథమసర్గము.



శ్రీనిమదిఁగోరిచెప్పెదఁ జేర్చివినుఁడి!
శబ్దమర్థంబుఁబాయని చందమునఁ బ
రస్పరైక్యప్రవృత్తిమైఁ గ్రాలుజగము
తల్లిదండ్రులు శబ్దార్థముల్లసిల్లఁ

౨. బార్వతీపరమేశ్వరుల్ బ్రాపొసంగి
మనుపవారికిభక్తి నమస్కరింతు.
సూర్యవంశమ దెక్కడ? సూక్ష్మవిషయ
మైననామతియెక్కడ? హస్తిమశక

3. తారతమ్యంబు చూపట్టు; దానికేమి
తెప్పతోనబ్ధిదాఁట యత్నించువాఁడ.
మందబుద్ధిని దనచేతికందరాని
మ్రానిపండ్లకుఁ జేసాఁచుగూనివాని

౪. తీరునంగవియశముఁ బ్రార్థింపఁబోవు
నన్నుఁగనుఁగొని యెల్లరునవ్వకుంద్రె!
వట్టిభయమేలనేఁదెచ్చిపెట్టికొందు?
భవ్యవాల్మీకి ముఖ్యవిద్వద్విరచిత

౫. మార్గమునుబట్టిచొచ్చెద, మాటలేల
రంధ్రములుగల మణులదారంబుమాడ్కి.
అట్టె? యాజన్మశుద్ధులైనట్టివారు;
పట్టినదితుదముట్టించునట్టివారు;

౬. మించియావార్ధిధరణిఁబాలించువారు;
వేల్పుపురిదాఁకఁ దేరునడ్పించువారు;
విధివిధానముచొప్పున వేల్చువారు;
యాచకులను యథేచ్ఛఁగాపాడువారు;

౭. నేరముకొలంది దండనల్ నెఱపువారు;
కార్యములపట్లజాగరూకతగలారు;
ధనముత్యాగంబుకొఱకుఁ గూర్చినధనికులు;
కల్లలేమైనదూరునో చెల్లయించుఁ

౮. బోలుమితభాషులొమతి శాలివరులు;
కీర్తికైసర్వదిగ్విజిగీషనొంది
ముఖ్యమైనపితౄణ విముక్తికొఱకుఁ
గానుగార్హస్థ్య మీకొన్న కర్మవిదులు;

౯. శైశవంబున విద్యాప్రవేశమంది
యౌవనంబున భోగవిహారమొంది
యుత్తముదిమి ఋషీశ్వరవృత్తిఁబూని
తుదకుఁబరమాత్మ యోగానవదిలిమేను

౧౦. సలిపిచతురాశ్రమవిధాన సరణినిష్ఠ
వైభవంబులఁదూఁగినవారు తొల్లి

రఘు మహావంశభూషణ రాజమణులు.
వారిసుమహాన్వవాయ విస్తారమెల్లఁ

౧౧. దద్గుణస్ఫూర్తి విన్నతత్క్షణమునుండి
శక్తికొలఁదినివర్ణింపఁ జపలబుద్ధి
వొడమెఁద్రిప్పఁగరాక ; కావుననువ్రాయఁ
దొడఁగితినిబ్రజ్ఞనాచోటఁ దోడెమయ్యు

౧౨. మలినపథమూర్తిబంగారు కలితిఁదీర్చు
కరణి నోసదసద్వివేక మతులార !
వినఁగఁదగుదురు మీరిదివీనులిచ్చి.
వేదములకెల్లఁ బ్రణవంబువిధముగాను

౧౩. రాజచంద్రులలో నాద్యుఁడైజగాన
మాననీయమనీషాభి మానియగుచు
మనువుగాంచెవైవస్వత మనువునాఁగ.
సంతతశ్లాఘ్యమునుశుద్ధి మంతమైన

౧౪. యామహారాజునన్వయ మందుఁబుట్టె
శుద్ధిమత్తరుఁడని సుప్రసిద్ధిగాంచి
స్తవ్యచారిత్రుఁడు దిలీపచక్రవర్తి.
వానివక్షస్సువెడఁదమై కానవచ్చె ;

౧౫. మూఁపులాతనివాఁబోతు మూఁపురములు ;
పొడవులో సాలవృక్షంబు వడవువాఁడు ;
క్షత్రియునికినిదగ్గట్టి కాయయష్టి
క్షాత్రధర్మావతారమై గ్రాలునతఁడు.

౧౬. అతఁడు తేజోబలంబుల నందరాక
జగతిసరిలేక నెమ్మేనిసౌష్ఠవముల
మేరుపర్వతరీతి భూమీతలంబు
"నాక్రమించెను సర్వత్రయంగసాఁచి."

౧౭. వానియాకారమెంతో విజ్ఞానమంత;
విజ్ఞతయదెంతో శాస్త్రప్రవేశమంత;
యాగమాభ్యాస తుల్యశౌర్యప్రతీతి.
కార్యములయట్లె ఫలసిద్ధిఘనతరంబు.

౧౮. జలధిమకరాదివృతమయ్యు సకలరత్న
గర్భమైనకతంబున గర్హ్యమెపుడు
గాకయభిగమ్యమైనట్లు గానతండు
గణ్యతేజః ప్రభావ దాక్షిణ్యముఖ్య

౧౯. దివ్యగుణములు గల్గియధృష్యుఁడగుటె
కాకయభిగమ్యుఁడును నగునేకరీతి.
నేరుపరిత్రోలు నరదంబు నేమిగతులు
జాటఁదప్పనిలాగునఁ బ్రజలుమనువు

౨౦. కాలమందున్న యాచారకాండమందు
వీసమయినను దొలఁగక వెలుఁగుచుండ్రి.
వృష్టిక్రమ్మఱదయచేయ వేగుణముల
రవిజలాకర్షణము సేయురాజసమున

౨౧. నాదిలీపమహారాజు నాత్మదేశ
జనులపైఁబన్నుగట్టెఁ, దత్సౌఖ్యమరసి.

అతనివయిసాధనము చతురంగబలమె ;
కానిమూలబలంబులు కాంచరెండు—

౨౨. శాస్త్రములనడ్డులేని ప్రశస్తధిషణ,
ధనువునందప్రమేయ విద్యాచతురిమ ;
ధనువులోననతండు పెట్టినదిపేరు.
గుప్తమంత్రరూపేంగిత గూఢకలన

౨౩. ములసొబగుమీఱు నృపకార్యములవిపూర్వ
పుణ్యమునుబోలిఫలముచేఁ బొందబడెడు.
వెఱపులేకయ్యునెమ్మేని కొఱఁతలుడిపి
చీకుచింతలులేకయ్యుఁ జేసిధర్మ

౨౪. మర్థమార్జించికాంక్ష లేకయ్యుదాన
సుఖమనుభవించె నాసక్తిఁజూపకున్న.
మనసువడియును దెలియంగమానమూన
నేర్చియునుమారుసేయంగ నోర్చియుండ

౨౫. దానమీఁగల్గితన్నుతి దాల్పకుండఁ
దద్గుణంబులు తమవిరుద్ధగుణములను
గలిసియన్యోన్యసహచర బలముకతన
సానఁబట్టినవన్నియం గానవచ్చె.

౨౬. ఇంద్రియమ్ములయమ్ముల యెగురునొంచి
వేదవేదాంతవిద్యల వెరవులరసి
సర్వదాధర్మమునబుద్ధి చక్క నిలిపి
రాజిలుదిలీప సన్మహారాజునకును

౨౭. వృద్ధగాకుండినన్ వయో విషయమందుఁ
జెత్తనంబబ్బె సుగుణసంపత్తిలోన.
బాగులోగులు నేరిపిభయముదీర్చె
పెట్టువోతలకు నడుముగట్టినట్టి

౨౮. యతఁడెప్రజలకునిజముగాఁ బెతరుఁడాయెఁ;
గన్నవారు కేవలమును గన్నవారె.
దండనవిధించిపేరిమైకె దండ్యులకును
సంతుకై పెండ్లి యాడినాసరసవరుని

౨౯. యర్థకామంబులెపుడు ధర్మార్థమగును.
మన్నగదిలీపనృపమణి మన్నగాంచి
యజ్ఞములగుండ స్వర్లోకమాదరించె:
మఘువుఁడును వృష్టిరూపానమహిభరించె:

౩౦. వెలసెనిట్లిర్వురకును శ్రీవినిమయంబు.
అతనిరాజ్యంబునందు దొంగతనమనఁగ
వినిగ్రహించిరెకాకెప్డు కనిమెఱుఁగరు;
చనునెసామంతులనువాని సాటితేఁగ?

౩౧. రోగిచేదౌషధముమ్రింగు లాగుశిష్ట
జనులద్వేష్యులనైనను గనికరించి
పురుగుముట్టిన వ్రేలైనఁ దరగుకరణి
దుష్టుఁబ్రియుఁడువీడు టాతనితోడిపాడ.

౩౨. వానిగుణములు పరసౌఖ్యవాంసితములు,
భూతపంచకమరివోయఁ బోలుబ్రహ్మ.

కట్టిపెట్టని చెల్లెలికట్టకోట
కడలిగమిదానిఁ జుట్టినకందకంబు

౩౩. గానతఁడననన్య శాసనమైనయుర్వి
నిత్యకీర్తినిబాలించె సత్యరతిని.
మగధవంశజదాక్షిణ్య మహిమవతియు
నౌసుదక్షిణనతఁడు పెండ్లాడినాఁడు.

౩౪. దక్షిణాధ్వరతుల్యు లాదంపతులును.
తక్కినంతఃపురస్త్రీలు పెక్కు ఉన్న
నాసుదక్షిణయబ్బ రాజ్యరమగలుగ
నాతఁడుకళత్రవంతుఁడైనట్టులెంచెఁ

౩౫. దగినపెండ్లము దొరకెను దనకటంచు
నాత్మసంతోషమందియయ్యవనిభర్త.
పడయఁగానామెయందును గొడుకునొకనిఁ
గోరుచుండంగఁగడచెను గొన్నినాళ్లు.

౩౬. తానుసంతతికై యనుష్ఠానములను
జేయఁదలపెట్టి యాతండుచేతిరాజ్య
భారమెల్లను దనమంత్రి వరులమీఁదఁ
బెట్టిభార్యాసమేతుఁడై వేల్పుపెద్దఁ

౩౭. దద్దయర్చించిశుద్ధులై తమకులగురు
లౌవసిష్ఠులయాశ్రమమరసిచనిరొ.
కొడుకువాఁపిరి దీక్షంగగురులకడకు
మధురగంభీరనాదంబు మహినిగప్ప

3౯. జంపతులఁగొని చనన్గ్లస్యందనంబు
విద్యుదైరావతములుపై వెలయనడుచు
ప్రావృడంబుదమనఁగఁ జూపటనఁదోఁచె.
వెలచియాశ్రమబాధకు వీరుమితవు

3౯. రస్సరులయిరొ యేగినం బ్రతిభకతన
సేనతోవచ్చినట్టులే కానఁబడిరి.
మార్గమధ్యంబునందు రా జ్ఞమహిషులకును
గలిగెమిక్కిలిగాను సౌఖ్యప్రపత్తి.

౪౦. సర్జనిర్యాసపరిమళాస్పద తనువులు
పుష్పసురభులాకంపిత భూరుహములు
మందమారుతములు వారివిందుఁగొలిపె.
నేమిగర్జోన్ముఖంబులై నెమలులులియ

౪౧. ద్వివిధషడ్జస్వరము పురివిచ్చవించు
నాఁడుమగజింకలరదంబు నట్టెదరియ
వానికన్నులఁదమవాని వన్నెనెన్ని
రాణివాసముతోఁగూడి రాజుగడచె.

౪౨. బెగ్గురుపులుగులాకాశవీధియందుఁ
దెగనిమాలగఁబోఁగను మొగమునెత్తి
రాజ్ఞిరాజున స్తంభ తోరణమునకును
వింతపడుచును వెల్లిరి విపినవీధి.

౪3. గాలియనుకూలమై వెన్నుకడనెవీవ
గుజ్జములముందు వెనుకల గొరిజ లెగుచు

పాంసువులుముంగురులపయిఁ బడకయుండఁ
గార్యసిద్ధియానను కొంచుఁ గడిచిరపుడు.

౪౪. తమ్మికొలఁకులచల్లని తెమ్మెరలును
బూలతావులునిట్టూర్పు మేలమాడ
నాత్మదత్తాగ్రహారయజ్వాగ్రగణ్య
శోభనాశీస్సులందుచుఁ జోద్యపడుచు,

౪౫. రేయిగాచినవెన్న నేహోయిగాను
గొంచువచ్చినముదుసలి గొల్లవాండ్రఁ
గానఁగాన్పించునట్టి వృక్షముల పేళ్ల
నారయుచునన్నిటిని బేరు పేరువరుసఁ

౪౬. గాంతమామేని తొడవులుగాంతిగ్రమ్మ
మంచువిరిసినమీఁదట మించుగులుకు
చిత్రసోముండునఁదగి చిత్రభంగి
వారువోవంగఁబోడఁగన్న వారికట్టి

౪౭. సొబగుజగదద్భుతంబయి చూడనయ్యె.
బుధసముండైనయారాజు పోవునట్టి
త్రోవవింతలు వెలఁదికిఁ దొడరిచెప్పుచు
నెంతదూరముగడచెనో యెఱుఁగఁడయ్యె.

౪౮. చీమదూరంగనెడమీని చిట్టడవులుఁ
గాకిదూరంగజంకెడు కారడవులు
దాఁటియారాచసింగము నాటిమాపు
నొచ్చినట్టిరథ్యంబుల నొగలనూడ్చి

౪౯. వేడ్కమైఁజేరినాఁడు దేవేరితోడఁ
గులగురుండౌవసిష్ఠు నిలలితవాటి
కన్యమర్లభమైన సద్యశసుకతన.
లాఁతివనములనుండి ఫలంబులును స

౫౦. మిథలుదర్భలుగొనివచ్చు మేటిబుషుల
నెదురుకొనియెడుఁ త్రేతాగ్నులెవరెఱుఁగక.
అమలినంబైన తద్వసిష్ఠాశ్రమమునఁ
దేఱనివ్వరిధాన్యంబు తినఁగమఱగి

౫౧. పర్ణశాలలముఖమంటపమువదలక
మూఁగుఁబెంపుడు జింకలుమునులు సతులు
ప్రేమతోఁగనిపెంచెడు బిడ్డలవలె.
నెమ్మిమైఁదోఁటచెట్లకు నీరుచల్లు

౫౨. మునులకన్నెలుపాదులఁ బులుఁగులట్టె
క్రోలవిశ్వాసపడుటకై కుఱుచచెట్లు
విడచిపెట్టెద రవశ్యాని విడిదిలోన.
ఎండవాలిన నివ్వరియెల్లఁజేర్చి

౫౩. కుప్పవైచినముంగిళ్లఁ గూరుచుండి
నెమరువెట్టెడు మృగములునిత్యమచట.
ఆహుతులవాసనలుగ్రమ్మ నాకసంబు
నంచుగాలికిఁగదులుచు నందమిచ్చు

౫౪. పొగలుమూఁడగ్నులవి యటనగపడియెడు
డాయఁగలవారిఁబుణ్యులఁజేయఁగలిగి.

ఇట్టిబుఋష్యాశ్రమము చేర నేగి రాజు
తేరివాహనముల సేదదీర్చి విశ్ర

౫౫. మించపసూతునికింజెప్పి మెలఁకువొప్ప
దింపి దేవేరిఁదాఁగూడ దిగ్గిరథము
కొంతచన; నిర్జితేంద్రియుల్ గుంపుగూడి
సభ్యులగునట్టిమునులు సౌజన్యధన్య

౫౬. నయవిశారదచాక్షుషజ్ఞానకలిత
రక్షకునిఁబూజసేసి రాప్రభువరేణ్యు.
అపుడుసాయంతనపు విధులయినపిదప
వహ్నిమూర్తినిఁబూజించు స్వాహకరణిఁ

౫౭. దానరుంధతిపూజావిధానములను
జేయఁగైకొనుచున్న వసిష్ఠమునులఁ
గాంచిసంతోషపడుచు భూకాంతుఁడింతి
తోడసాష్టాంగమెఱఁగి సత్పుత్రుఁగోరి

౫౮. పడసెనాశీస్సుమర్యాదఁ బ్రాక్తనర్షి
దంపతులవల్ల ధర్మంబు దారియదియె.
దివ్యఋషిచంద్ర నిర్మితాతిథ్యములను
దేరిమీఁదియాయాసంబు దీఱఁగాను

౫౯. మునియురాజ్యాశ్రమమునిర్మై మొనసినట్టి
కులపతిఁగూర్చి రాజ్యంబు కుశలమడిగె.
వైరిపురములుదహించి వాఙ్నిపుణతఁ
జమరువడసికుబేరుని సాటిగాంచి

౨౦. తగుదిలీపమహారాజ ధర్మవేది
యామునీంద్రునియెదుట నిట్లనియెనొదిఁగి.
సప్తరాజ్యాంగములమీ ప్రసాదమహిమ
కలిమినారాష్ట్రమునను గుశలముగలదు.

౨౧. దైవమానుషకృతవిపద్భారమెల్లఁ
గరుణతో మారుసేయంగఁ గలుఁగమీరు
మాకునింకేమికొదవ? సేమంబుకలవె?
నయనములకు నగోచరులయినయరుల

౨౨. మాటలోఁబరిమార్చు మీమంత్రములకు
నెదుటఁగనఁబడ్డ వైరులనీల్గఁజేయు
మాశిలీముఖములు తూఁగుమాటలున్నె?
మహాత్మపుంగవనీ వగ్నిహోత్రమందు

౨౩. వేల్చుచున్నహవిస్సకా వృష్టిరూప
మెత్తివఱపునవాడు పయిరులనెల్ల
నుద్ధరించుచునుండె జగద్ధితముగ.
ఘనభవద్ధృష్టా వర్షసకారణమున

౨౪. జనులునూఱేండ్లు నిండినమనువుపడసి
నాదురాజ్యంబునం భయమేదియీతి
బాధపేరైనఁదెలియక ప్రబలుచుంద్రు.
బ్రహ్మమానసపుత్ర సంభావ్యగుణుఁడ

౨౫. నీదయాదృష్టి నాపైనినిండిపార్ల
నాపదలు మూలమూలలనంతరింప

సంపదలు హెచ్చకుండునే తెంపుతోడ ?
అయినమీకోడలయిన యీయబలయందు

౬౬. నాకుసంతానమింకఁ గానఁబడకుంటఁ
జూచిభూదేవి మిగులసంకోచపడెడు
దీనమైరత్నగర్భ సద్వ్యపయయ్యె.
వంశవిచ్ఛేద మూహించివంశ్యులైన

౬౭. పితరులెల్లఁబిండములు నావెనుకవేయఁ
దమకునెవ్వరు లేరని తలరిక్రుస్సి,
శ్రాద్ధములఁబిత్రు భోజ్యముఁజప్పరించి,
దిగవిడుపెకాని తృప్తిగాఁదినుట లేదు.

౬౮. మీఁదటను నాకుఁ దమకుఁదిలోదకములు
విడుచువారలుండరటంచు వేడియూర్పు
లిచ్చినాయిచ్చునుదకంబు వెచ్చవడఁగఁ
బుచ్చుకోనొల్లరుపితాళ్లు, ఫ్రానినిజము.

౬౯. యజ్ఞములుసల్పుటను విశుద్ధాత్మఁబెరసి
లోపముండుటసంతతిలోన, నేను
జక్రవాళమహాగిరి చందమునను
గాంచుచుంటిఁ బ్రకాశాప్రకాశగతులు.

౭౦. తపసుదానంబుగలిమిని దప్పకుండఁ
బారలౌకికసౌఖ్యంబు పడయవచ్చుఁ
గాని, పరిశుద్ధవంశసంతానముననొ,
యైహికాముష్మిక సుఖములందఁదగును.

౨౧. అట్టిసంతానలబ్ధి లేనట్టినన్ను
నాశ్రమస్థలి నీరోవ్వియుచరసినట్టి
మొక్కపైనుండుప్రేమిడి కెక్కువగను
బ్రోతువీదశకీ వెట్లు పోకకుండు?

౨౨. భవ్యసృష్టికర్తా? భగవత్స్వరూప?
అంత్యమానాపిత్రూణము, వ్యాధికతనఁ
గట్టివేయంగఁబడి దోమకాటుఁజిక్కి
పఱవయత్నించు హస్తికిబంధనంబు

౨౩. వలెనునాకునొసంగు దుర్వారబాధ:
కానని క్ష్వాకువంశ ప్రకాండులకును
మేలుసేయంగసిద్ధులఁ జాలమీకు
శక్తిగలదుపిత్రూణ విముక్తుఁజేసి

౨౪. నన్నుబ్రతికింపుమోతండ్రి, నయముమీఱ!
అనిదిలీపమహారాజు మనవిచేయ
నాఋషియుసత్తమీన మహాహ్రదముపగిది
ధ్యానతత్పరతను తెప్పలార్పకుండి

౨౫. యంతలోదివ్యదృష్టి నైనవనినాథు
సంతతిప్రతిబంధ బీజంబెఱింగి
పలికెనిట్లని యెదుటభూపాలుఁగూర్చి.
"తొల్లియింద్రుని సేవించి మళ్లిభువికి

౨౬. నీవువచ్చెడునప్పుడు త్రోవలోను
గల్పకచ్ఛాయక్రిందను గామధేను

వగపడఁగనీవును బ్రదక్షిణార్ఘ్యాయంచు
దానినెఱిఁగిఋతుస్నాత రాణిఁదలఁచి
౭౭. ధర్మలోపభయంబునఁద్వరపడుచును
సత్కరింపకపోఁగితి సాధుపణితి.
అప్పుటుసుర నైచికియాగ్రహపడి
"సంతుఁదలపోస్తినను దిరస్కారబుద్ధిఁ
౭౮. జూచిచూడకపోయెదు, చూడునీవు
నామసంతతిగొలిచి మన్ననలుగొనక
సంతుగలుగంగఁబోద" నిశాపమిచ్చె.
మేటిమదగజ మొకఁడప్డుమిన్నువాఁక
౭౯. ఘీంకరింపంగ నాక్రందుక్రిందముడుఁగు
శాపశబ్దమువినరీవు సారథియును.
నీ మనోభీష్టసిద్ధికి నేడుసఫల
మాటకునునాటి శాపమేయడ్డపడెడు.—
౮౦. పూజ్యపూజలుసలుపమిఁ బుడమినరులు
శ్రేయమభివృద్ధి యెప్పుడు జెందరుగద.
ఇప్పుడాతెఱ గంటియావొప్పుమీఱ
నప్పతియొనర్చు చిరకాలయాగమునకు
౮౧. ఘృతహవిస్సులు గురిసెడువ్రతముమీఁద
వ్యాళపిహితకవాట పాతాళమందు
మిన్నులంత్తైయధిష్ఠించి యున్నఁగాని,
నీవుశుద్ధాత్మ గల్గిపత్నీసమేత

ర-౨. ముగనుదత్పుత్రినందిని బూజసేసి
తల్లికిం బ్రతిగాను రంజిల్లఁగంటి
వేనినీకోర్కె లీడేర్చునిదినిజంబు.
అంచునాసంయమి యుపదేశించుచుండఁ

ర-౩. గానెతద్ధవనము గుర్యఁగడఁగుకామ
ధేనుసత్సుతనందనీ ధేనువట్టి
వచ్చెనచ్చటికిని బ్రాంతవనమునుండి.
ననలనునుపును వానియెఱ్ఱనయుఁగల్గి

ర-౪. పయినఁదెల్లని వెంద్రుకవంకసాఁగఁ
బూఁపచందురు నౌదలఁబూనునట్టి
సంజకెంజాయ లాపేయజాడఁదెలిపె.
బానకం బెనుజానగు దానిపొదుగు.

ర-౫. లేఁగదూరానఁ బొడగన్న వేగిరంబ
గోరువెచ్చనిపాలను గురిసిపుడమి
తడుపుఁదత్సుతి స్నాతయాధన్యుఁ డెపుడుఁ
బూతతరుఁడగునవబృథ స్నాతకంబె.

ర-౬. అట్లుసేరంగ నావేల్పుటావు పెయ్య
కాలుత్రొక్కిళ్ల ఱేఁగిన ధూళిదాఁకి
చెంతఁగూర్చున్న యారాజశేఖరునకు
వివిధతీర్థనిమజ్జన వేళకంబె

ర-౭. మేనునిలువెల్లనుబవిత్ర మైనదపుడు.
శౌకునికసత్తముండైన సంయమియును

పుణ్యదర్శనసురగవి పుత్రిఁజూచి
రాజుకోరికలీడేఱు నోజఁదెలిసి
౮౮. యిట్టులనియెనుయాజ్యుఁడా నృపతితోడ.
"అదిగోసురధేను పుత్రికళ్యాణధాత్రి
తలఁచుకొంచుండువేళనే తానువచ్చె,
నీయదృష్టముపండెను నేఁటితోడ,
౮౯. నీదుకార్యము సిద్ధించు నేడుతేపు.
నేఁడుదొరకొనిదీని వెన్నాడియడవిఁ
గందమూలఫలాదులఁ గడుపుపూడ్చి
విద్యలభ్యాసలభ్యమౌ విధముగాను
౯౦. దీనినిరతానుసరణినైయుఁ దేజ్వైతత్సు
దయనుబడయంగనెంతయుఁ దగునునీవు.
కూరుచుండుమునీవది గూరుచున్న,
నేర్పుమైనిలుమీయది నిలిచేనేని,
౯౧. సంచరింపుమీతోనది సంచరింపఁ
ద్రావుమీనీరమదినీళ్లు ద్రావునపుడు,
అనుసరణమన్ననిదిగాఁగ నరయుమదిని
నీదుభార్యయున్వహమును నేమమొప్ప
౯౨. దీనినర్చించి యధికభక్తిమతిమతిని
బంపుచును తేపకడఁదపో వనముదాఁక
మఱలఁగొని తెచ్చునదిమునిమాపులందు.
ఇట్టులీవుప్రసాదము పుట్టువఱకు

౯౩. నందినీపరిచర్య సేయందలంచి,
వెడలుమీాయిప్పుడే "తవాఽవిఘ్నమస్తు"
పుత్రవంతులలోఁబేరు పొందఁగలవు;
నమ్మునామాట, రాజ! మీానాయనవలె.

౯౪. దేశకాలజ్ఞుఁడైన నృదేవుఁడంత
నాలుదానునునైక కంఠ్యంబుగాను
గురులతో "స్వామి! చిత్తము, గురుని యుక్తి
పద్ధతినివ్రతమాచరింపఁగలమనియె"

౯౫. వినయనమ్రత్వమెంతయు వింతఁగొలుప.
సత్యవాక్యప్రమాణ దోషజ్ఞుఁడుపర
మేష్ఠిమానససుతుఁడు వసిష్ఠుఁడపుడు
తలఁచినఫలంబునకును సాధనముగన్న

౯౬. రాజదంపతులకును నిద్రాసమర్హ
శయ్యకల్పింప నూహించి క్షత్రశయ్య
నీకవ్రతతత్పరత్వము నెదగణించి
దర్భశయనాదిసామగ్రి దాచ్చెనాఁడు.

౯౭. చ॥ తనకును భార్యకున్నిలువఁ దగ్గదియంచువ
సిష్ఠమౌనిచూ । పినకుశశయ్యపైనొఱఁగి పెండ్లము
మిక్కిలిసేమమొప్పఁ బ్ర । కట నెనిదురింపఁబండు
కొనిక్షాత్రవతంసుఁడు వేఁకువం డెమేల్ । కనియె
ను వేదపాఠములు కర్ణపుటంబులు చిల్లువుచ్చఁ
గాఁ॥

౯౮. ఆ॥ వె॥ తొంటికవులయూహధోరణులిప్పటి।
వారికెల్లఁ దేఁటపఱుపఁ గోరి।
దీనిఁ దెనుఁగు సేయఁ దివిరెను గురుదయా
వావిలాల వాసుదేవశాస్త్రి ॥



## ద్వితీయసర్గము.



తెల్లవాఱనరేశ్వర తల్లజుండు
సాధువినయధురీణ యశోధనుండు
దూడపాల్గ్రోలియెంతయు దొడ్డిపర్వఁ
గట్టుమట్టకుఁబలుపునఁ గట్టిదానిఁ

౨. దల్లిగోవునుగై సేయఁ దనదుభార్య
వనముకైత్రోలె ఋషిధేనువునుముదమున.
ధన్యసాధ్వీలలామసుదక్షిణాంబ
విప్పుగొఱిజలుదగిలి పవిత్రమయిన

౩. పాంసుజాలంబుగప్పిన బాటబడిని
శ్రుతిపదార్థమనుసరించు స్మృతివిధమున
నడచిపోయెనుశుద్ధమా నసముకలిమి.
అమలకీర్తిసురభి కరుణార్ద్రుఁడైన

౪. రాజుమఱలించిదయిత సురభితనూజ
సంద్రములునాల్గునాలుగు చన్నులుగను
నేలినట్టులెభూగోవుఁ ద్రోలెదాను
మనువుసంతతిబిరుదును మందలించి.

౫. ఆత్మరక్షాపరుండయి యతఁడు వెంట
వచ్చుచున్నట్టితక్కిన వారినెల్ల
వెనుకఁదిగఁబడ నెంతయు వేడుకొనియొ
గోవుకన్నాకుచో భక్తి గావుకొనఁగ.

౬. సాధురక్షకుఁడు దిలీపచక్రవర్తి
పచ్చపచ్చికఁదెచ్చి యందిచ్చుచుండి
లాలనముచేయుచును గంగడోలుగోఁకి
యడవియీఁగలువాలనీ కవలఁబుచ్చి

౭. యిచ్చవచ్చినచో మేయ నిచ్చిసౌర
భేయిదిక్కునశుశ్రూష చేయుచుండె.
పండుకొనియొడు వేళలఁ బండుకొనుచు
నిలఁబడినతావులను దానునిష్ఠనిలిచి

౮. లేచినడయాడఁ దాఁగూడలేచిపోయి
నీరుద్రావంగనిల్చిన నీరుగోరి
నీడవలెనిట్లు నందినిఁగూడిచనియె.
రాజచిహ్నంబులాతపత్రప్రభృతులు

౯. లేనివాఁడయ్యు నారాజులోనమదము
గలిగిపయికిని లేనట్లు గానిపించు
హస్తిరాజువలెం బ్రతాపామునెల్ల
నూహ్యములుగల్గియెంతయు నొప్పెసంగె.

౧౦. జుట్టుసిగగట్టితీవియ జొంపములను
నెక్కువెట్టినవిల్లుచేఁ జక్కఁబూని

శ్రేనురక్షామిషంబున మానవపతి
దుష్టవనసత్వములఁజంపఁ దొడరిరిగా.

౧౧. పార్శ్వచరులనుడించినం బార్థివుండు
వనమునందలిప్రక్కల పాదపముల
మీఁదియున్నత విహగనినాదగతులె
వనవిశేషంబులెల్లఁ జూపినటుతోఁచె.

౧౨. గాలిచేనూఁపఁబడ్డల తాళులపుడు
గాలిచెలికానిఁబోలిన కాంతివెల్గు
తేనికెదురయిపూవుల వానగురిసెఁ
బురజులాచారలాజలు గురియుక్రియను,

౧౩. నరపతిసుధన్విమై భయంకరుఁడునయ్యుఁ
గరుణదొలికెడునెమ్మిని గాంతిబలిమి
నాఁడుజింకలుగన్విచ్చి చూడఁదగిమె.
మనుజపతివనదేవతల్ తనయశస్సు

౧౪. పొగడికొనుటవలెంగాలి పోసికొన్న
వెదురుబొంగులమ్రోఁతలు వినియెబిట్టు.
గొడుగువ్రతహేతువున వీడిబడలియున్న
పుడమియొడయునిపైబట్టి పొడమిపవనుఁ

౧౫. డట్టితరుతతినూఁచి పూలన్నిరాల్చి
కొండవాగులతుంపరల్ మెండుచల్లి
యలఁతపోఁగొట్టె రాజునకవ్వనమున.
రక్షకుండయివనము నారాజుచొరఁగ

౧౬. వానలేకాటిపోయెద వానలంబు.
వింతఁగొల్పుచు ఫలవృష్టివృద్ధిహెచ్చె.
సత్వములుతమ సహజవైషమ్యమెల్లఁ
గలిపిమున్నీటమెలఁగెను గలిసిమెలసి.

౧౭. కెంజిగురుఁగేణిసేసెడు కంజహితుని
కాంతియునునందినియును దిగంతరమున
సంచరించిపవిత్రత సంస్కరించి
యరసినిలయంబుచేర దినాంతమందు

౧౮. దేవపిత్రతిథినిరత తృప్తికొఱకు
సాయపడునందినికి వెంటఁ బోయెనృపుఁడు.
సజ్జనార్చితుఁడాతని సరసగూడ
నందినిసదర్చితసువిధానప్రయుక్త

౧౯. మైనయాస్తిక్యబుద్ధి చందాన వెలసె.
మఱలిపోవుచుఁగాంచెను మనుజవిభుఁడు
పడిదలంబొర్లిగట్టెక్క పందికదుపు
నెలవుకొనుమ్రాఁకులంజేరు నెమ్మిబారు

౨౦. లేఁతపచ్చికనేలల లేళ్లచాలుఁ
గలిగిచీకటిగ్రమ్మెడు గహనతలము.
ఎట్లుకైసేసినదియొ యొంటిఁతపెయ్య
పొదుఁగుభారంబుమైవేల్పు మొదవుకూన

౨౧. రాజునట్లెశరీర గౌరవముచేత
రాణిదెచ్చెనువిపిన మార్గంబునకును.

వెనుకనైనందినికిఁజను విభునిఁగాంచు
రాజ్ఞికన్నెప్పలార్పక ప్రతిజనంబు
౨౨. జలముద్రావంగ గమకించుశ్రద్ధతోడ.
రాజదంపతులకు మధ్యఁగ్రాలుగోవు
చనెనహోరాత్రముల సందుసంధ్యభాతి.
అక్షతలగిన్నెఁబూని సుదక్షిణాంబ
౨౩. పాలనోండ్చెడు నా వేల్పు పాఁడియావు
వలగొనినమస్కరించికొమ్ములనడుమను
గార్యసంసిద్ధికినిద్రోవ గాగణించి
యధికభక్తినిశ్రద్ధను నర్చచేసె.
౨౪. దూడఁజూడంగనెంతయు దుమికిపడియు
సంచరింపకయే స్వీకరించెఁబూజఁ
నందినియు; రాజురాజ్ఞి యానందపడిరి.
సత్యముగను మహాత్ములసత్ప్రసాద
౨౫. చిహ్నములుఫలమునకుఁ బోచిల్లుచల్లు.
అధికవిఖ్యాతిరాన సహాయగతిని
శత్రువిచ్ఛిత్తి చేసినచక్రవర్తి
వలనుగనరుంధతీ వసిష్ఠులకునెఱఁగి
౨౬. సాంధ్యకరణీయములుదీర్చి చట్లనిండఁ
బాలువిదికినపిమ్మట భక్తిమెఱయఁ
గానుసేవించెనందినీ కామదోగ్ధ్రి.
బలులుదీపంబులునుజుట్టు బలియనాల

౨౭. గాపరితనంబుగయికొన్న భూపవరుఁడు
పెండ్లమునుదానుగూర్చుండి పేయమేయ
నిదురపోవంగనదియొయ్యు నిద్రఁజెంది
లేవనదిరేపకడఁగూడ లేచుచుండె.

౨౮. బడుగుదీనులపాలింటి పుడుకుఁజెట్టు
మహితకీర్తిమంతుఁడురాజు మహిషితోడఁ
బయినిజెప్పినయట్లుగో వ్రతముసల్పి
తనుజలాభంబుతలపోయు చునుమనంగ

౨౯. వడిగముయ్యేడుదినములు గడచిపోయె.
మఱుదినంబుననందిని మహిపమౌళి
భక్తిద్రఢిమపరీక్షింప వలనుచూచి
గంగపొంగెడునెలవు కుఱంగటబలు

౩౦. మించులీనంగఁబచ్చిక మంచుకొండ
లోయలోనొక్క పెనుగవి లోనదూఱె.
క్రూరమృగములునందినిం జేరలేవ
టంచుభయమేదిరాజు హిమాద్రిశోభ

౩౧. కచ్చెరువడంగనంతలో నతనికంట
బడకయొకసింగమాగోవు మెడవడిగను
బట్టియీడ్చెబలాత్కృతిఁ బయికిదుమికి.
అంతనందినియార్చెదిశావకాశ

౩౨. ములుఘుణిల్లనిమార్మోయ మలవడంక;
నార్తసాధువునృపతియయ్యార్తివిన్న

తోడనేపగ్గములుగట్టి తోడినట్లు
వానిదృష్టిమరలెను బర్వతమునుండి.

33. నిండుజేగురుగప్పిన కొండనెత్త
మందమలొద్దుగుమ్రానుండు నందమునను
బాటలపునందినిపయిని బ్రభలువెలయ
నెక్కికూర్చున్నకేసరి నృపుఁడుగాంచె.

34. బలిమిమైయమపురికిని బంపివైరి
వీరులనుదీనసంత్రాణ బిరుదుఁడైన
సింహయానదిలీపరాశ్ఛేఖరుండు
కెరలియభిభూతికమ్మహా కేసరినొగిఁ

35. జంపగానంపపొదిలోని శరమువట్టెఁ
గానిబాణంబులాగఁ బోఁగానుగోళ్ల
కాంతులెల్లనుబక్కి ఱెక్కలనుగ్రమ్మ
వడిగఁగుడిచేయిబిగియించి పిడికిలోఁగఁ,

36. జిత్తరువువోలెఁగదలక చేయినిలిచె.
సింహమహిమంబు మిక్కిలి చిత్రమయ్యె.
చేయిస్తంభింపఁగోపంబు చేటువెరిగి
చెంతనపరాధిశిక్షింపఁ జేరలేక,

37. కఠినమంత్రౌషధమ్ములఁ గట్టువడుట
బలముసగ్గియుబుసగొట్టు పాముపలెను
మేనుభగ్గునమండఁ గంపించెనృపుడు.
చిక్కవడ్డట్టిగోవును నొక్కిపట్టి

౩౮. సింహమాత్రీయశక్తిక చ్చెరువుపడుచు
మనెడుసత్పూరుషసహాయు మనుమహాన్వ
వాయచిహ్నంబుహార్యక్షు బలపటిష్ఠుఁ
బలికెనిట్టులుమానవ వాక్యములను.

౩౯. చాలుభూపాలనీప్రయాసంబుమాను
మిప్పుడమ్మరిఁబోసినం దప్పిచనును.
జెట్టుఁగూల్చెడుగాలికి గట్టువడునె?
ధారుణీనాథ కైలాస గౌరవృషము

౪౦. నెకటఁదలపెట్టుశివుపద స్పృకుటఁదగిలి
నాదపృష్ఠముపూతమై నదికరంబు
శైవమంత్రద్రఢిష్ఠమహా సాంద్రభక్తి
గొన్నకుంభోదరుండని కుంభసముఁడ.

౪౧. మానవేశ్వరయిదిగో పెన్మ్రాఁకులకును
బ్రోదికనుగొంటెదేవదా రుద్రుమంబు
మంచుటాచూలి పాలిచ్చిపెంచునట్లు
పెంచెనీర్వోసికావున వృషభవాహ

౪౨. నుండుదీననుగాంచెఁ దనూజలబ్ధి.
మున్నొకానొకదినమున మోటయడవి
యేనుఁగొకటటిదీనితో మేనురాయ
వాడివగుడయిబెరడెల్ల నూడిపోయె.

౪౩. అదివినుచుఁబార్వతీదేవి యసురవరుల
చేఁగుమారుండునొగులుటల్ చెవినిబడ్డ

నాఁటివలెనేడ్చె నోఁడఁ గన్నీటికాల్వ.
నాఁడెసుమినన్ను నేనిక సూఁడుగాఁగఁ

౪౪. బంపినాఁడిటముమ్మైన వాలుదాల్పు
వ్రానుదరిసిన మెగముల వ్రందఁజేసి
యద్రిపక్షిని నిదురింపనానతిచ్చి.
శంభునిర్దిష్టభోజన సమయమునకుఁ

౪౫. జేరవచ్చినదీగోవు చిక్కె-నాకు
దీనిశోణితపారణ నేనొనర్తు
రాహువిందునిసుధఁబోలెఁ బ్రబలుతృప్తి.
దిగ్గునే లేచిపొమ్మోయి సిగ్గువదిలి

౪౬. గట్టిగురుభక్తినీయెడ గలదుచాల
శక్తిచాలక కార్య మశక్యమయిన
శస్త్రధరులకదియ పయశస్సుదేదు
కీర్తిలోపంబటంచు శంకింపఁబోకు.

౪౭. పోతుసింగంబువలికిన పొగరుమాట
లాలకించిదిలీప మహాధిరాజు
తనదుశరములుకొఱగాక దర్పకారి
మహిమకావుటఁదానను మానపడక

౪౮. తొంటిబాణప్రయోగమే గెంటుదినఁగఁ
త్ర్యంబకునివీక్షణంబున స్తంభపడుచు
వజ్రమేయంగనేరని వాసవుక్రియఁ
గంపమొందియిట్లనియె సింగంబుతోడ.

౪౯. అలవుచెడిపోయిమరియుఁజే బలిమినచ్చి
యున్ననామాటలకు నవ్వుకుంటవింత.
అయినజీవులయంతస్సు లన్నినీకు
నెఱుకగావునఁజెప్పుడు మదీప్సితమ్ము.

౫౦. సర్వసచరాచరజగత్ప్రచయములకును
రమణసృష్టిస్థితిలయకారణుఁడుగురుఁడు
పరమశివమూర్తిపూజ్యుఁడై పరగునాకు.
ప్రాణములుమిడుకాడనీ పాలఁబడ్డ

౫౧. మునివసిష్ఠులగోరూప ధనముఁగూడఁ
దగదుపేక్షింపనీయట్టి ధన్యునకును.
కాననాశరీరంబెఱ గాఁగ్రహించి
ప్రొద్దుగుంకంనే లేఁగఁ బొడగనంగ

౫౨. నులుకునీధేనువును విడ్వుమోయికరుణ.
అంతగోఅలకాంతులు సంతమసము
ప్రస్సిపోఁజేయహాసియించిపలికెనిట్లు
లొడయనికిశివభక్తుఁడౌ యూథపారి.

౫౩. కాంచుమేకాతపత్ర జగత్ప్రభుతయుఁ
గాంతయౌవనస్థితియు బంగారుమేను,
నొకర్రయల్పఫలంబుకై చక్రడంతె?
మిన్ననీకంటెమాఘ్యమం దెన్నఁబడఁడు.

౫౪. భూతదయనీకుఁగలదని బొంకెదేమొ
నీవుచచ్చినగోవాండె జీవమొందు

నీవుబ్రతికినలక్షల నీదుప్రజలఁ
దండ్రివలెఁబ్రోచిరక్షింపఁ దగుదువయ్య.

౫౫. మునికిఁగోపంబువచ్చునే మోయటన్న
నొంటియావునుగోల్పోయి మంటగలుపు
నంతగోపంబువడియెడు నాబుషికిని
గుండపోదుఁగులగోవులు కోట్లాసంగి

౫౬. యతనికోపంబుచిటికలో వాల్పఁగలవు.
నిఖిలశుభములనుభవించు నీదుమేను
గాచుకొనిపాపమునకు సంకోచపడకు.
వృద్ధసేవనమునకు నాయింద్రరాజ్య

౫౭. మునకుభేదములేదని వినమెశ్రుతుల ?
అనుచుసింగమ్మువాక్రుచ్చి యాఁగియుండ
గుహలుమార్మోయనచ్చలి కొండప్రేమఁ
దానుఁదద్భంగిఁజెప్పిన తగవుదోఁచె.

౫౮. సింహపాదంబుక్రిందటఁ జిక్కువడుచుఁ
బొరిఁబొరిందన్నుఁజూడంగ సురగవిసుత
కరుణమేషారరాజుకే సరికిననిమె.
క్షతమువలనఁదరింపుగా క్షత్రమయ్యెఁ

౫౯. దద్విరుద్ధతగల్గిన ధాత్రిపతికి
రాజ్యముండిలేనట్లె సర్వమ్మువమ్ము.
నిందమోసినబ్రతుకునా కెందుకవల ?
నూటిగాఁబెఱయావులు కోటులైన

౬౦. సాటిరావునందినికిని జగతినమ్ము
కామధేనువునకునుదగ్గదుగుణమునఁ
గానమునికోపమార్పంగ లేనుదాన:
అట్టిగోవిట్టువడుటనిన్ బట్టిగాదు

౬౧. నిన్నుఁబట్టినభూతేశు నెన్నిలోఁగె.
తగుదెపట్టనింజూడు నీమొగముఁజూడు?
ఇట్టిమహిమలుగలగోవు నట్లెవదిలి
బదులుగానామొడల్ గొన్న బ్రతికెదీవు.

౬౨. ఋషికిహోమాదులనులోప మేమిరాదు.
తెలియవిను సింహరాజమా దేవదారు.
వృక్షరక్షణనీకెట్టి విధియొనాకు
ధేనురక్షణమట్టి విధియయటంచు.

౬3. స్వామిభక్తిని నీకు నేఁ జాలువాఁడ.
నేనువధ్యుఁడఁగానని నీకుఁగరుణ
వొడమెనేఁగీర్తిదేహిత్వ ముడుగకిమ్ము.
మాదృశవివేకులకును సింహంబభౌత

౬౪. మైనయీదేహయష్టి పైనాస్థలేదు.
కలిసిమాటాడినంతనే చెలిమిగలుగు ;
నట్టిస్నేహంబుమనకీవ నాంతమందు
భయులకునుసమకూడె దైవాత్తుగాను;

౬౫. జెలిమికానికుయ్యాలింపశ్రేయమొదవు.—
వల్లెయనిసింగమాగోవు వదలిపెట్టె.

తోనహస్తాదులెల్ల స్వాధీనపడఁగఁ
గైదువులకట్టడించి యాత్మావరుండు
౬౬. మాంసపిండమువలెనిజ హింసకోర్చి
మృగపతికినర్పణముగాను మేనొసంగె.
అపుడుసింగంబుతనమీఁద నడుఁగులిడెడు
క్రమముభావించురాజు శిరస్సువంచి
౬౭. నిలువదివ్యులు పూలవానలుగురిసిరి.
అంత "బాలకలెమ్మ"ను నమృతవాక్కు
నొకటివినిలేచిముందటి సుకృతిపండి
జనవరుఁడుతల్లివలెమ్రోలఁజన్నులవిసి
౬౮. పాలుగురిసెడునందిని భవ్యఁగాంచె.
సింగముగపడకేపోయెఁ జెల్లచెదరి.
ఉచ్చవడినిలుచుండిన ధేనిఁజూచి
నందినీధేనువిట్లనె నయముమీఱ:
౬౯. నిన్బరీక్షింపఁగోరుచు నేనెయిట్టి
మాయనెఱపినదానను మనుజనాథ.
ఋషిమహిమవల్లఁబట్టదు మృత్యువునిను
దక్కక్రముక్కడిమెకములు లెక్కయేమి.
౭౦. పుత్రనీగురుభక్తి సంపూర్ణతకును
మెచ్చితింజాలనీకునా మీఁదిదయను;
నేనుగేవలక్షీరాల నిచ్చునావు
గానుసూతుష్టనైతిని గామదోగ్ధ్రిఁ;

౭౧. గోరకలునీకుఁగలవన్ని కోరవయ్య.
బహువనీపకులనుబ్రోచి బహుళకీర్తి
గాంచిత్రిజగతీవీర విఖ్యాతివడసి
నట్టియొడయఁడు ధేనువునెట్టయెదుట

౭౨. దీనుఁడగుచు సుదక్షిణాదేవియందు
వంశకర్తమహాకీర్తి వైభవుండు
వైనతనయుయాచించె బద్ధాంజలియయి.
సురపయస్వినియదివిని కరుణవడసి

౭౩. యక్లైకానిమ్ముపుత్ర యొకాకుదొన్నెఁ
బిండినాపాలుఇందుతప్పదుమీ నింధ్ధువుతిన
టంచునాజ్ఞయొసంగిన నవనిభర్త
యనియె—నోతల్లి నీలెఁగతనియఁగుడిచి

౭౪. హోమవిధికినిజెల్లినపై మిగిలిన
పాలుగ్రోలెదనమ్మనే నేలుపుడమిఁ
గోరియాఅవపాలును గొన్నరీతి
నందిమానీంద్రునానతి గొందునదియు.

౭౫. ఇటునృపతివిన్నవించిన ఋషిగవియును
హృష్టురాలౌచు, వెంటనే హిమవదవని
ధరమునందుండివెనుక భూధవుఁడురాఁగ
నశ్రమంబునఁజేరె ఋష్యాశ్రమంబు.

౭౬. అంతనారాజునందిని హర్షమొంది
తనకొసంగినవరమునా మునికిఁజెప్పి

పిమ్మటనుగ్రమ్మఱనుజెప్పె బ్రేయసికిని.
భవ్యచారిత్రసజ్జన వత్సలుండు

౭౭. భూవిభుండప్డువత్స హుతావశిష్ట
నందినీస్తన్యములు తదాజ్ఞఁగొనిగ్రోలె.
ప్రొద్దుపొడువంగగోసేవ భోజనంబు
చేసినిలుచున్నరాజు రాజ్ఞినివసిష్ఠుఁ

౭౮. డంపెఁదత్పురమునకు స్వస్త్యయనమిచ్చి.
మహిపతిప్రదక్షిణించి నమస్కరించి
శ్రుతిగతివసిష్ఠులకును నరుంధతికిని
హవిరధికదీప్తుఁడైన హుతాశనునకుఁ

౭౯. బిమ్మటసవత్సనందినిఁ బ్రీతనెఱఁగి
యితరమంగళాచరణముల్ హితవుమీర
సలిపితరలెసుదక్షిణా సహితుఁడగుచు.
ధర్మపత్నీసమేతుఁడై ధరణివరుఁడు

౮౦. తనమనోరథమీడేఱు టనుసుఖముగఁ
బథమున౯ఱాళ్లుదగలక త్వరనుబోవు
రథమువిధమునఁజేరెను రాజధాని
శ్రవణసుఖముగనేములు రావమీఱ.

౮౧. కనుబడకయుండయధికోత్సుకత్వమునను
గార్శ్యమొందిప్రజార్థమై క్రమ్మఱనున
వోదయమ్మునజనుల వినోదపెట్టు
రాజుజనములపాలిటి రాజయయ్యె.

౮౨. అతనిఁగొలిచిరిప్రజలు మహోదరమున.
భ్రాజితశచీపలక్ష్మియతా రాజమౌళి
గ్రాలఁజదలంబతాకలు జాలఁబార
జాలమే తెంచియెదురుకో సంతసించి

౮౩. భటసమూహంబెదుట బరాబరులువెట్టఁ
తూర్యనాదంబులెసఁగఁ బాథోధిమ్రోఁత
రీతిఁగయి సేసినట్టి పురిఁ సుఖప్ర
వేశమొందియాశీస్సిడ విప్రవరులు

౮౪. భుజగనాథప్రతిమనిజ భుజమునందుఁ
బ్రభుతసర్వసర్వం సహాభరముదాల్చె॥

ఉ॥ ఆకసమత్రినేత్ర ఫలమామరవాహినియ
గ్ని దేవుచే। నీకొనియుంపఁబడ్డ పరమేశ్వ
రునంశమునెట్లొ యట్లెతా। నాకమలా
యతాక్షి మగధాన్వయ జాతసుదక్షి
ణాంబది । కాపికృతి తేజముల్ గొనిన
యర్భకు గర్భమునందుఁ దాలిచెఁ॥



# తృతీయసర్గము.



అప్పుడుసుదక్షిణకునెల దప్పఁగానె
భక్తినోఁచిననోములపంటయగుచుఁ
దోడిచెలికత్తెలంద నెంతోముదంబు
పరఁగియిక్ష్వాకుకులపరం పరకుమూల

౨. మగనుదౌహృదలక్షణ ములుచెలంగె.
తనువుకృశియింపసొమ్ములు దాల్పకన్ని
మోముమెలబాఱలొద్దుగు పూవువలెను
సాటిగాంచెసుదక్షిణ చదలవెదుక

౩. నెక్కడోఁటికొగా న్పింప నొక్కకళయు
లేనిచందురుఁడపరాద్రి పైనిఁదోప
గ్రాలుచున్నవేఁకువ జాముఠాతిరికిని.
మనసుపడికచ్చికలుదిన్న మగువమోము

౪. పరిమళముమించముద్దిడి పార్థివుండు
తొలకటింపఁగవేసంగి తొలఁగియడవి
కొలనిలోనీరుద్రావంగఁ గోరివచ్చి
ఘుమఘుమాయింపుమూఁచూచి చమికిపాలు

౫. గజమునకుఁగల్గుతృప్తిని గాంచినాఁడు.
మహిషికినివృత్తికలుగిన మనుసగుటలె
యాబిడకుఁబుట్టుసుతుఁడు దిగంతభూమి
భోజ్యముగ నేలఁగలఁడను పొలఁకువోసఁగె.

౬. సిగ్గుచేతసుదక్షిణ క్షితిపుతోడ
నేమికావలెనోచెప్ప నిచ్చగింప
కుండుటయెఱింగి కోసలేశుండు నామె
చెలులనడుగుచుఁ గోర్కెఁదీర్చెడునునిచ్చ.

౭. వింటిసాయాననాపృథివీవరుండు
వలచితనకోరువస్తువు స్వర్గమందు
దొరుకునదియైనఁదేఁజాలు కరణిసులభ
మునవెవేఁకటిపెండ్లము మనసుపడ్డ

౮. దేనినేనియునప్పుడే తెచ్చియిచ్చు.
నెలలుగడవంగనద్దేవి తలఁగినొగులు
లంగసౌష్ఠవమొంది పండాకులెల్ల
రాలిననిచినలతభంగి గ్రాలఁజొచ్చె.

౯. నెలఁతపాలిండ్లు నెలలునిండినకొలంది
బలిసిమిక్కిలిగామొనల్ నలుపుమీరి
తుమ్మెదలుపయిముసరిన తమ్మిమొగ్గ
లట్టెతెగడెను. రాజసింహంబుభార్య

౧౦. గర్భమునఁదేజరిల్లెడు నర్భకునిని
భూమిలోపలినిధులతోఁ బోలికగాను

జమ్మిలోఁడాఁగు వహ్నికి సాటిగాను
జనసరస్వతిలోఁదాఁచు జలముపగిదిఁ.

౧౧. తేజమొందిపవిత్రుఁడౌ తెఱఁగునెఱిఁగి.
అన్నిదెలిసినయానృపుఁ డతివమీఁదఁ
దనకుగలయట్టియనురాగ దార్ఢ్యమునను
మానససమున్నతికి స్వసంపద్గరిమకుఁ

౧౨. దనయలబ్ధికైపొంగు నుత్సాహమునకు
ననువుపడురీతిఁబుంసవ నాదికశుభ
కార్యములుజరిపెను యథాక్రమముగాను.
అష్టదిక్పాలకళలంది యలరుమీఁఱు

౧౩. గర్భగౌరవమునలేవఁ గష్టపడుచు
రాజ్ఞితానటులింటికి రాగఁజూచి
చేయునోనుపచారముల్ చేయఁగాంచి
సంతసంబందెనుదిలీప చక్రవర్తి.

౧౪. గర్భపోషణవిషయమై గర్భవైద్య
కుశలులగునాప్తభిషజులు గుంపుగూడి
వలసినచికిత్సచేయింపఁ బదవనెలను
రాజచంద్రుఁడుకాలమై ప్రసవగతికి

౧౫. దరియుభార్యనువేదనం దలరుదాని
గాంచిగ్రీష్మాంతమునవలెఁ గాంచెసుఖము.
అయిదుగ్రహములు సూర్యుతోనంటకుచ్చ
గతినివెలుగంగఁదనదు భాగ్యంబుపండి

౧౬. సన్నొప్పులుహెచ్చిన శచికినెందు:
దీసిపోనిసుదక్షిణా దేవికపుడు
పుట్టెఁబుత్రుండు సాధనపూర్ణతకును
గడమలేనట్టియర్థంబు గల్గినట్లు.

౧౭. త్రిజగదభివృద్ధికొఱకెయా నృపసుతుండు
కోరియావిర్భవించిన కారణముగ
జన్మనిమిషానదిశలు ప్రసన్నమయ్యె.
వాయువులువీవసాఁగెను హాయిగాలిపి.

౧౮. హవ్యముప్రదక్షిణార్చులనందెనగ్ని.
సర్వముశుభంబెసూచించు జాడలెచ్చె.
ఆనడికిరేయిపసిబిడ్డ మేనిసోరు
పురిటిమంచంబునల్గడ బెరయగాను

౧౯. దీపములుదమకాంతుల దీప్తిదగ్గి
చిత్తరువుదివ్వెలయ్యెను జిత్రముగను.
పుత్రజన్మంబుఁదనకంతి పురమువారు
చెవులకమృతంపుసోనగాఁ జెప్పినపుడె

౨౦. ప్రభువారికిచ్ఛత్రాత పత్రముభయ
చామరంబులుదక్క నొసంగెనన్ని.
గాలిలేకచలింపని కమలములవి
ధంబునంగంటిఔప్ప గడల్పకుండ

౨౧. సుతునిసుందరముఖమును జూచిరాజు
జలధిచంద్రోదయంబునఁ జెలఁగుక్రియను

బట్టరానట్టిసంతోష భరముదాల్చె.
శిష్టులుఁబురోధలైన వసిష్ఠమునులు

౨౨. వినుచుశుభవర్తమానము వెడలివచ్చి
జాతకర్మముదీర్ప నాచారఫణితి
రాజిలెదిలీపపుత్రుండు ప్రబలగతిని
సానఁబట్టినఖనిజంబు చందమొంది.

౨౩. నాఁటిసంభ్రమువర్ణింప నలువగలఁడె?
తుష్టినిచ్చెడుమంగళతూర్యరవము
వారరమణులనృత్తశృంగారరచన
లీలఁగ్రాసేసెనహహ దిలీపనృపతి!

౨౪. దేవిడీలోనెకాకుండ దివముఁగూడ.
కొడుకుపుట్టినసంతోష మడుగనేల
నృపతికినిహద్దుమీఱిన యెలమిపొంగి
వెదకికారాగృహస్థుల విడుదలకును

౨౫. సెలవొసంగెనుగాని యాచిత్రమేమొ
కానరాఁడయ్యెనపుడొకఁడుఖయిదియైనఁ;
జేరయినవినకున్నఁ దప్పిదమనంగ
బందిఖానాలుఖాళీలు పడుటవింతె?

౨౬. కానియారాజుతాను బిత్రూణమునకు
ముక్తిగాంచిమహానంద మనుభజంచె.
విభుఁడపుడుతానుశబ్దార్థ వేత్తయాట
సుతుఁడుశాస్త్రిపరిజ్ఞాన సుఖమువడసి.

౨౭. శత్రుసంహారరూపక సౌఖ్యమొంది
వర్థిలంగలఁడంచు భావమున నెంచి
సార్థకంబగురఘునామ మర్థిఁబ్రానె.
పూర్ణసంపదగలతండ్రి పోషణమున

౨౮. రఘువాఁడలుచేసివర్థిల్లెఁ గ్రమముగాను
సూర్యకిరణప్రవేశ విస్ఫూర్తికతన
వింతగానెలబాలుఁడు పెరుగుపోల్కి.
మదినుమామహేశ్వరులు కుమారువలన

౨౯. నలశచీపురందరులు జయంతువలన
సంతసించినరీతిదత్సదృశుఁడైన
రఘుఁబొడఁగాంచిరాజ్ఞియురాజవరుఁడు
బొందిరట్టిరెయగుట నానందగరిమ.

౩౦. మన్కి వెక్కివచ్చిరాని మాటలకును
దల్లిదండ్రులుముద్దాడి దల్లసుతుని.
పిల్లనికిఁబంచిననుమాత్ర పితలప్రేమ
యొండొరులపయిఁగించి త్రునురిలిపోక

౩౧. జక్కవలకునువలెను బెంపెక్కసాఁగె.
ముద్దుకొమరుండువిద్దెము విద్దెమనఁగ
దాదప్రేల్ వట్టిలేచిక్రిందపడుచుండఁ
దల్లిదండ్రులుకన్నులఁ దనివివడసి

౩౨. తమకుజేజేయొసంగ ముదంబుపడిరి.
పట్టుకోఁగనెమైగ గుర్పాటువొందవు

చిన్నికొమరునిఁదొడపయిఁ జేర్చిరాజు
తాదృశానంద మెఱుఁగక దానికిమును
33. పెన్నరానియెలమి సాముకన్నుమూసె.
క్ష్మావరుఁడుతనయుత్తమ జన్మసుతుఁడు
గుణసమృద్ధినినిజవంశమునకుఁగీర్తి
దేఁగలండనిస్రష్ట యాత్మీయమూర్తి
3౪. భేదమగుచక్రితనసృష్టి వృద్ధిపఱుచు
సగుణుఁడైయనినమ్మిన జాడనమ్మె.
సుకరలగ్నానఁబుట్టు వెంద్రుకలుదీయ
జుల్లపములుపిల్లజుట్టును మొలిచియెగరఁ
3౫. దోడియీఁడగుమంత్రి పుత్రులనుగలిసి
యాటలాడచు నక్షరాభ్యాసమైన
నైదుబల్లును నేర్చి యామీఁదగుణిత
మభ్యసించెనుజలజంతు వాపగాము
3౬. ఖంబుగుండసముద్రంబు గాంచురీతి.
పిదపఁగొన్నాళ్లలిటుబడి చదువుచదివి
వడుగుచేయయధావిధి బాలరాజు
శాస్త్రవిదులైనగురువుల చక్కఁ సకల
3౭. శాస్త్రములునభ్యసించెద చ్ఛాస్త్రమువాని;
వలనసత్పాత్రమగుట నిష్ఫలముగాదు.
గురులమెప్పించెనారఘు వరుఁడుకళల.
నిశితబుద్ధియౌనారఘు నృపసుతుండు

౩౮. చూఱఁగొను శుశ్రూషాది సుగుణగణము
నరుఁడనిలాతిపాతి నిజాశ్వగతిని
క్రమముగా నాల్గుదిక్కులు గడచుమాడ్కి
ముదముతోఁ జతుర్విద్యా సముద్రములను

౩౯. దాఁటె గురుజనశిక్షమై నోటు లేక.
రఘువు క్షితిలో నెదురులేని ప్రభువె కాక
ధనువునకుఁ గూడ గురువైన తండ్రివలన
నభ్యసించెను భక్తిమై నస్త్రవిద్యఁ

౪౦. బొంకముగఁ గప్పుకొని కటి జింకతోలు.
పెరిగి కోడెయెగిత్తైన విధము దోఁప
నేనుఁగై నట్లుగున్నయే హెచ్చి హెచ్చి
శైశవంబును వదిలి యా క్ష్మాపసుతుఁడు

౪౧. యౌవనము వీటవిడియు ప్రాయంబు వడయు
నతిగభీరతతో సుందరత లభించె.
తండ్రి రఘువున కపుడు గోదానకర్మ
పూర్వకంబుగఁ బరిణయంబు నెరవేర్పఁ

౪౨. పెండ్లికూఁతులు తత్సమావేశమునను
జంద్రగతదక్షజలవలె సంభ్రమపడిరి.
పడుచుతనమాట చేఁగాడి పొడవు చేతు
లలరిబలిసిన మెడకాయ తలుపువంటి

౪౩. వెడఁదఱొమ్మును గలిగి పృథ్వీపసుతుఁడు
మేనిసొబగులఁ దండ్రికి మిన్నయయ్యె

వినయసంపత్తినతనికి వెలచియుండె.
అప్పుడుదిలీపనృపుండు నిజాత్మజాతు
౪౪. వినయముననమ్మివిద్యా వివేకమునను
జాలంగాలమునుండితాం జాలిమోచు
ప్రజలభారంబుబరువోటం బరిగణించి
కొడుకుయువరాజుశబ్దభా కుగానుగజేసె.
౪౫. వలపుగోరెడిసిరితమ్మి కొలంకువీడి
మాపులంగల్వలనుజేరు మాడ్కిరాజ్య
లక్ష్మియువరాజుపైనభి లాషపడియె.
గాలిదోడ్పడ్డంగార్చిచ్చు గ్రాలునట్లు
౪౬. మబ్బులేనప్డుసూర్యుండు మండునట్లు
మదముగారంగనేనుంగు బెదిరినట్లు
రాజుయువరాజుగనియంద రాకపోయె.
రాజబంధులతోయువ రాజుదిగుగ
౪౭. విల్లుధరియించిచేరంగం బిలిచితండ్రి
తానుదేవేంద్రువలెను శతక్రతువులు
చేయసమకట్టినదియెల్ల చెప్పియాగ
తురగసంరక్షణంబుకై తోడువనుప
౪౮. నేగిరఘురాజుగుఱ్ఱంబు నెగిచిపట్టి
నట్టిరాజులగెల్చి హయంబుదేంగ
నిట్లునెరవేర్చెనుదిలీప నృపతియొకటి
తక్కువగనూఱునశ్వమే ధములువరుస;

౪౯. నంతనూజవయోగంబు నమరఁజేయఁ
దగినగుఱ్ఱంబువదలెనా ధరణిపమణి.
వెంటనడువంగరక్షకుల్ విల్లువట్టి
యఖిలదేశంబులదిచొచ్చి యరుగనచట

౫౦. నెవ్వరికినగపడకుండ నింద్రుఁడట్టె
వారువముఁబట్టియేదిక్కొ పాఱిపోయె.
ఏమిచేయంగఁదోఁపక నృపసుతుండు
వాని సేనాపతులువెచ్చ వడినిలిచిరి.

౫౧. అంతలోనందినీధేను వెంతొడయను
గానఁబడెవారియెదుట నాకస్మికముగ.
సజ్జనార్చితరఘురాజు సరగదాని
దివ్యమగుపంచితంబును దిగిచిదానఁ

౫౨. గడిగికొనఁజేతితోఁదన కన్నులపుడె
యింద్రియములకుగోచర మెపుడుగాని
వస్తువులఁజూచుశక్తి పొల్పడెనతనికి.
కనియెనరదేవసుతుఁడుతూర్పునసూతుఁ

౫౩. డరదమునకునుగట్టఁబో నవలనివల
బయలజాడించినంగాళ్లు పట్టనీక
పగ్గములచేతగుఱ్ఱంబు పట్టికట్టి
యెత్తుకొనిపోవుచున్న దేవేంద్రునెదుట.

౫౪. పాటులేనివేగన్నుల వానిఁబచ్చ
గుఱ్ఱములవానిఁబోడగని గుర్తుపట్టి

యింద్రుఁడేగదయనినిశ్చ యించిమదిని
వానిఁద్రిప్పంగబిగ్గఱ పలికెనిట్లు.

౫౫. "యాగభోగాలుభుజియించు నమరవరుల
కెల్లనధినాథుఁడవటంచు నీవుసకల
విదులచే జెప్పఁబడుదువు విదితముగను.
అట్టిదేవేంద్రనీవిప్పు డారయంగ

౫౬. దీక్షమాతండ్రిచేయ యత్నించుచున్న
యాగవిఘ్నంబుచేయఁగా న్యాయమౌనె?
త్రిజగతీనాథుఁడవుదివ్య దృష్టిగలవు
యాగవిధ్వంసకులఁబట్టి యడఁచుటెల్లఁ

౫౭. బోయియిటునీవెవిఘ్నముల్ పొసగుతేని
యింకనిష్టలుభువిని దిక్కెఱిఁగిపోవె?
మఘవమాతండ్రిసలిపెడు మఖమునకును
ముఖ్యముగఁగావలయుగుఱ్ఱ మునువదులుమి;

౫౮. యన్యులకుబుద్ధిచెప్పుమీ యట్టివారు
మలినపద్ధతిఁబోవుట మాన్యమగునె?"
ఇట్లురఘురాజుచెప్పిన దెల్లవించుఁ
ద్రిప్పిరథముదివౌకః పతియునతనికిఁ

౫౯. జెప్పెనుత్తరమీక్రింది చొప్పుగాను
"క్షత్రియకుమారనీమాట సత్యమయినఁ
గీర్తిగోల్పోవఁజూతురే కీర్తిధనులు?
చూడుమీతండ్రిక్రతువులు సొరిదినూఱు

౬౦. చేసినాలోకవిఖ్యాతిఁ జెనయఁదలఁచె.
ఒక్కఁడే కేశవుఁడు పురుషోత్తముఁడని
యెదురు లేనిముక్కంటి మహేశ్వరుఁడని
ఋషులచేబహువిధముల నెన్నఁబడిన

౬౧. యట్లె నేనుశతక్రతు వనఁబడుదును ;
మూఁడులోకాలయందునీ మూఁడు పేర్లు
మాకుమువ్వురకునుదప్ప మరియొకనికిఁ
జెంద నేరవులాతుల కందఁబోవు

౬౨. గాననీగుఱ్ఱమునుబట్టి నాను నేను.
తొలఁగుమివివాదపెట్టక తొందఱపడి
లేద-సగరతనయులు తొల్లింటినాఁడు
కపిలఋషిజోలికేగిన కారణమునఁ

౬౩. జన్నగతికి నెనీవునుజనెదసుమ్మ."
అంతహయమునురక్షింప నరుగుదెంచి
చివరకిఁద్రునకర్పింపఁ జెల్లదంచు
రఘువుచెప్పెనతనికి నిర్భయముగనగి.

౬౪. "ఇంద్రనీకీహయముఁగొన నిచ్చయేని
యాయుధంబునుగైకొమ్మి హయమువెంట
రఘువువచ్చెఁబోవచ్చునె రాజసమున
వానిబాణపరంపర పాలుగాక."

౬౫. ఇట్లు దేవేంద్రుతోఁజెప్పి నృపసుతుండు
తనయిషుధియందునమ్ములు దార్చియెదిరి

మొనకు నిలఁబడెఁ గుడికాలు ముందు వెట్టి
చేవమీఱుచు సాక్షాత్తు శివుని వలెను.

౬౬. రఘుశిలీముఖ మింద్రునురస్సు గాడ
లీల నాతండు నడివానకాలమందు
మొయిలులో నేఁడురంగుల మొనయు తనదు
విల్లు నందెక్కిడెన మోఘ భల్ల మొకటి.

౬౭. రక్కసుల మేని పొగలాఱు రక్తమందె
ముందురుచిపడ్డ సురరాజు ములికి రఘువు
ఱొమ్ము నెత్తురు పైపయి చిమ్మ గ్రోలె.
వెనుబడక దానను గుమార విక్రముండు

౬౮. గావునఁ గుమారుఁ డయ్యె నాత్మోపసుతుఁడు
తఱుగా వెల్లటేనుఁగుఁ జటిచిచటిచి
కాయగాసిశచీక నద్దండభాగ
మకరికాచిహ్నితసురేంద్ర సుకరములను

౬౯. నాటితనయంకితంపు బాణంబునొకటి
నెమలిరెక్కలుగల్గు బాణమొకఁడు దొడి
యతని వజ్రధ్వజము ద్రుంచె నతులమహిమ.
దీనలేఖర్షభుండును దివ్యలక్ష్మి

౭౦. పరులచేఁ దలవట్టి యీడ్వఁబడినట్లు
భూపసుతుపయిఁ గనరాక కోపపడియె.
హెచ్చియొండొరుఁ గెల్వ 'గా నింద్రరఘులు
గరుడపన్నగసమభయంకరములగుచుఁ

౭౧. గ్రిందుమీఁదులఁదూఁగు పత్రితతితోడఁ
ముములయుద్ధముచేసిరి, తొలఁగిరపుడు
దేవతలుసైనికులుదూల దిగులుపడుచు.
దిగధిపాలురయంశాన జగతిఁబుట్టి

౭౨. నట్టిరఘువుపఱపు తర్చుటంపగములు
పూర్వదిక్పతిమాయింపఁ బోయిజడిసె
మేఘమొక వేళధారుణి మీఁదఁబడ్డ
నీటిపిడుగునుజల్లార్ప నేరనట్లు.

౭౩. చందనములందుటనుసువా సనలుగొలుపు
నింద్రుముంజేతఁద్రచ్చిన సంద్రమట్లు
మొరయువిలుద్రాటినాభూప ముఖ్యసుతుఁడు
పట్టితెగవ్రేసెనెలవంక బాణమునను.

౭౪. మచ్చరంబెచ్చికయికొని మఘువుఁడపుడు
ప్రబలశత్రువురఘువుపైఁ బర్వతముల
పక్షములగూల్చగానల వాటువడ్డ
ధళధళలుమీఱువజ్రాయు ధంబుదొడిగె

౭౫. నతనిప్రాణాలుగ్రోలంగ నగునటంచు.
రఘువుగాడనురంబు వజ్రంబుమివుల
సైనికులయశ్రుధారలతో నయిలకుఁ
బడియునిమిషంబులోవ్యథ పాటువోయి

౭౬. సంతసించెడుసైనిక సతతసింహ
నాదములతోడలేచెభూ నాథసుతుఁడు.

వజ్రమంతటిదానిని బరిభవించి
వెలయుచుండంగనిర్వక్ర విక్రమమున
౨౭. క్షత్రసుతుఁగనియింద్రుండు సంతసించె,
గుణముశత్రువులందైనఁ గొలుపుముదము.
"కొండపిండుకొలఁది తుండెతుండెములుగఁ
జెండఁగల్గిన నావాలు చీఱికిఁగొన
౨౮. కిట్లునిలుచునె యెవ్వఁడైననీవుదక్క!
ఎలమివొందితినిపుడునీ యలవునకును.
అశ్వమును గాక మరిదేనినైననడుగు"
మనుచుదేవేంద్రుఁడన్న వాక్యంబువినుచు
౨౯. రఘువుబంగరుపిడితో శరంబుసగము
దూసిదొననుండియరిఁబోయు దుముకువాఁడు
దానిఁబ్రతిసంహరించి, పథ్యంబువలుకఁ
జొచ్చినట్టిదేవేంద్రునిఁ జూచిపలికె.
౩౦. "వినుఁడిదేవేంద్రగుఱ్ఱము విడువవేని
ధన్యదీక్షాధరుండునా తండ్రియశ్వ
మేధఫలయుక్తుఁ డగునట్లుమెచ్చి పూర్ణ
యాగదీక్షుమై నీశ్వరునంశమాటఁ
౩౧. జేరరాకుండుమాతండ్రి గారికిపుడు
పంపవలెఁజుండిమీరె యీవార్తలెల్ల."
అనుడుదేవేంద్రుఁడునువల్లె యనుచుఁదరిలెఁ
బ్రతినలిచ్చుచుమాతలి రథముద్రిప్ప.

ర-౨. గుణశరీరిసుదక్షిణ కొడుకుగూడ
జయమునకు నెంతొయుబ్బక హాయముఁగోలు
పోయినందుకైతలరుచుఁ బురికిఁజసియె.
అటదిలీపమహారాజు నమరవరుని

ర-౩. వలనసర్వంబుమున్నగాఁ దెలిసికొడుకు
నెదురుకొనితూర్యములతోడ ముదముహెచ్చి
బాష్పధారలవానిని వజ్రహతిని
గాడఁబడికాయగాసిన చాయఁజల్ల

ర-౪. చల్లగాఁదుడ్చిసుతుఁగూర్చి సంతసించె.
ఇట్లునిష్ఠాగరిమనున రేంద్రవరుఁడు
ఖ్యాతిఁదొంబదితొమ్మిది యాగములను
సలిపినిలిపెనుగాలావ సానవేళ

ర-౫. స్వర్గమెకరిఁగసరళ సోపానపఙ్క్తిగ.

ఉ॥ సాంద్రవిరక్తిహేతువున సర్వముఱోసినయా
దిలీపరా। ట్చంద్రుడురాజచిహ్నములు ఛత్ర
ముఖంబులొసంగియాత్మజుఁ। సంద్రములేటి
మధ్యగల ధ్మాతల మేలఁబ్రతిష్ఠచేసిని। స్తంద్ర
మహాయశంబున సుదక్షిణతోవనభూమికేగె
బో। కుంద్రెనిజాన్వయక్రమము నూఱకయా
ఱడిపోవఁ జూతురే॥

౫౬. తే॥గీ॥ తొంటికవులయూహా ధోరణులిప్పటి।
వారికెల్లఁదేటపఱుపఁగోరి
దీనిఁదెనుఁగుఁజేయదివిరితిఁగైకొండు
వావిలాలవాసు దేవశాస్త్రి॥



# చతుర్థసర్గము.



రఘువుతనతండ్రియిచ్చిన రాజ్యమొంది
సూర్యతేజస్సుధరియించి సొబగుమీఱు
మాఁపటిహుతాశనునివలె మహిమఁగాంచె.
తాదిలీపమహారాజు మోదమొంది

౨. రఘుమహారాజునకొసంగె రాజ్యమనుచు
వినఁగనేశత్రురాజుల మనములందు
మునుపుహొగరాఁజుతాపంబు మొనసిమండె.
వానకొఱకింద్రుఁటెక్కెంబు ఫ్రానియూరు

3. చుట్టుద్రిప్పెడియప్పటి చొప్పుగాను
రఘుమహారాజుపట్టాభి రాముఁడౌచుఁ
బట్టణంబుననూరేగఁ బ్రజలుతమకు
టుంబములతోడఁగనిరి నేత్రంబులార.

౪. గడిచిరఘుపతియేనుఁగు నడలుమెరయ
నలమెఁబితృసింహపీఠంబు నరిగణంబు.
అగపడనిదయ్యులక్ష్మీ యాయవనిజాని
శయగపద్మాతపత్రంబు ఛాయవలనఁ

౫. గానంబడుచుండెరాజ విక్రాంతియదియె.
వందిమాగధులారాజ వర్యుఁదగిన
కాలములనుతియింప దిక్పాలవరుల
యంశమగుటను వాణి ధన్యాత్మయయ్యె.

౬. మనువులోనగు రాజులు మునుపు తన్నుఁ
బాలనముచేసినంగాని వారికంటె
రఘువు కాలములోధాత్రి రమణకెక్కె.
శిక్షకర్హుల నేపట్టి శిక్ష చేసి

౭. యర్హజనులను నాతి శీతోష్ణముగను
క్షితిపతియుఁదన్నె మలయమారుతమువలెను,
తీయమామిడిపిందెలు దిగినపిదపఁ
బూవుజొంపములకుమది పోనిమాడ్కి

౮. ననఘు రఘువును జూచి గుణాధికతను
బ్రజదిలీపునినంతగా వలవరైరి.
ధరణిపుఁడువినిధర్మ మధర్మగతియు
నీతివేత్తలచే ధర్మ నిపుణతఁగనె.

౯. సర్వధర్మంబులువరుస జరుపఁబడగఁ
బంచభూతగుణంబులు మించెభువిని.
క్రొత్తరాజుప్రభుత్వంబు క్రొత్తగొలిపె.
చంద్రుఁడాహ్లాదపఱిచి తాసార్థుఁడయ్యెఁ

౧౦. దపనుఁడుప్రతాపమునను సార్థకతగాంచె.
రఘువునన్వర్థుఁడయ్యె భూరంజనమున.

రఘువు కన్నుకర్ణాంత విశ్రాంతమయ్యెఁ
గార్యములపట్లదృష్టి సూక్ష్మంబుగాను
౧౧. గనఁబడియె శాస్త్రమర్యాద లనుసరించి
తక్తుమీఁదనురఘువు స్వస్థతగనంగ.
రాజ్యలక్ష్మి రెండవతేఁపఁ బ్రబలపడియెఁ.
గాంతిగోలుపంగఁ దచ్ఛిహ్నకమలములకు
౧౨. నిచ్చఁగోరినగతిశరదృతువువచ్చె.
తీఱఁగురిసినమబ్బులు తేల్పఁద్రోవ
నినుప్రతాపంబుదిక్కుల నెచ్చియలమె,
నినుప్రతాపంబు దిక్కులనెచ్చియలమె.
౧౩. వానకాలముగడుచుడుఁ బైగ్లుపండ
శక్రుఁడెత్తినధనువుప సంహరించెఁ;
దోడనేరఘురాజు శత్రువులమీఁద
జైత్రధనువును జేపట్టె సహజముగను
౧౪. బ్రజలమేలునకీయింద్రరఘులుపాటు
పడుదురేకాదెయొకరి తర్వాతనొకరు.
పుండరీకాతపత్రంబు పూనెవికచ
కాశచామరములుదాల్చి కానిబుతువు
౧౫. తోడరిరఘురాజుసిరితోడఁ దూఁగదయ్యె.
ప్రజలుచల్లనిదయగల రాజునందుఁ
జలువలూడగూర్చుచంద్రుని వలనసరిగఁ
గూర్చిరనురాగరసమును గోర్కులలర.

౧౬. రాజుసత్కీర్తి సంపదల్ గ్రాలఁజొచ్చె
నంచపదువుల, ఆకళులయందుఁ, దెల్ల
గలువలందునునిర్మల జలములందు.
చెలువుగంబాలనీడల నొఱిగియున్న

౧౭. చేలకాఁపరిబాలికల్ చిత్రమపుడు
బాల్యముననుండిగడుమంచి వాఁడటంచు
వినఁగఁబడురాజుగారి సద్గుణసుకీర్తి
వర్ణనలుచేసిపాటలు పాడుచుండ్రు.

౧౮. మహితతేజుఁడగస్త్య సన్మౌనిరాక
జలములన్నియు నిర్మలములయినవిగ.
మహితవిక్రముఁడానృప మౌళిరాక
కనఁగశత్రులమనములు కలకబారె.

౧౯. క్షోణిపాలునివిక్రమ సూచనముగ
నేపుమీఱుచుబలిసిన మూఁపురముల
తోడనేటికఱల్ కొమ్ము తోడఁజిమ్మి
పెల్లగించెడునచ్చటి వృషభచయము.

౨౦. మదపుటేనుఁగులాఱేని మహినిదమ్ముఁ
గెంటివలచునేఁడాకుల నంటిపూల
నేవగించుచుగురిసెఁదా మేఁడుగతుల.
నదులుదిబ్బలువాఱంగ నడుచుత్రోవ

౨౧. లందుబురదయిగిరిపోవనాశరత్తు
మొనసియుత్సాహమునకంటె ముందుదానె

యాత్రవెట్టెనునృపుదండ యాత్రకరుగ.
రఘుమహారాజువాజినీ రాజనమును

౨౨. శాంతిహోమముచెల్లింప సంతసించి
జ్వలనుఁడుప్రదక్షిణార్చుల జయముదెల్పె.
రాజధానికిదాఁపు దుర్గములకెల్ల
రక్షగాఁగొంతసైన్యంబు గ్రాలఁజేసి

౨౩. విప్రపూజాదిశుభవిధుల్ వెలయఁబుచ్చి
యాఱువిధములబలములు నంటినడువఁ
బార్థివుఁడుదిగ్జిగీషనుబైలువెడలె.
పాలతఱఁగలుమందర పర్వతంబు

౨౪. కలఁకపెట్టంగనెగసిన జలకణముల
నచ్యుతునిబూజసేసిన యట్లుప్రోలి
ముసలిముత్తైదువలుమహా మోదలబ్ధి
నపుడులాజాక్షతలుచల్లి రథిపుమీఁద.

౨౫. ఇంద్రతుల్యుండురఘురాజు సాంద్రమహిమ
గాలివలనిజెండాగుడ్డ కదలికలను
శత్రురాజులజడిపించు చందమొంది
మొట్టమొదటనుదూర్పున కట్టెనడిచె.

౨౬. రథపుగాండ్లనుతేఁగిన రజముఁగూడి
యభ్రసంఘంబుగ్రేణించు హస్తియూథ
ఆకసముభూమియనుగుర్తు లడుగుపఱచె.
మొనఁబ్రతాపంబుతరువాత జనరవములు

౨౭. వెనుకనుబరాగవున్దాని వెనుకరథము
ఖములుగాసేనతాఁజతు స్నిగ్ధమయ్యె.
వానిసామర్థ్యమేమొ భూజానిపోఁగ
జలముపుట్టనిభూముల జెలలుపుట్టెఁ;

౨౮. బడనవలసెడు నదులెల్లనడకుఁజాలె,
నతిప్రకాశములయ్యెఁగా అడవులన్ని.
తూర్పుసంద్రమువైపై సేన తోడజరగు
రఘుమహారాజుశివశిరో భ్రష్టగంగ

౨౯. తోడనేగుభగీరథు తోడనెనసె.
చెట్లులూఁగించిపువురాల నట్టునిట్టు
పెళ్లగించుచుఁగుంకుడి వ్రేళ్లతోడ
వెళ్లునేనుంగుమార్గంబు విధముగాను

3౦. వైరిరాజులనోర్చి కప్పములనంది
మూర్ఖరాజులనడఁగాఱ మొత్తినెత్తిఁ
బోవురఘురాజు దాడిపెన్పునవెలింగె.
విజయశీలుఁడురఘుపృథివీవరుండు

3౧. తూర్పుసీమనుగలప్రోల్లు దోడరిపట్టి
తుదకుఁగొన్నాళ్లకుందాటితోఁపులలమి
నల్లవడ్డసంద్రవుపట్టె నల్లదరిసె.
క్ష్మాపతితనకునమ్రులు గానివారి

3౨. ధ్వంసమునుజేయకెపుడు విడ్వండటంచు
సింహదేశాధినాథులు చెందిభయము

ప్రబ్బలినదీరయమునకు వంగినట్లు
ప్రణతులై తమవెల్లఁగా పొందుకొనిరి.

౩౩. నావలసహాయమునమీఁద నడవఁజూచు
వంగదేశాధిపతులను బలిమిఁబట్టి
నాయకుండప్డుజాహ్నవీ తోయమధ్య
ధాటిఁబాఁతించెఁదనజయ స్తంభములను.

౩౪. కానిసర్వంబుగోల్పోయి కంపమొందఁ
గరుణరఘురాజురాజ్యముల్ దిరిగియొసఁగఁ
బెలుకఁబడియూఁకుకుదురుతో వుఅలనాటఁ
బడియుఁబోలమరికినివంగి ఫలమొసంగు.

౩౫. కరణినతనికిఁగట్టిరి కరముతేండ్లు.
పనుఁగులబారుసేతువై సేననడువ
దాఁటికపిశనుత్కలపతుల్ దారిచూప
నీశుఁడటుతర్లెనుగళింగ దేశములకు.

౩౬. ఘనతగంభీరవేదియా గజముమీఁదఁ
గలుకుగాలముమూవటి నెఱప్లినట్లు
తనప్రతాపముమిగులఁ దీక్ష్ణతతోడ
నగపతిచెభూపుఁడుమహేంద్ర నగముమీఁద.

౩౭. గజసహాయునిరఘురాజుఁ గాంచితాఁగ
ళింగరాజస్త్రముల్ చేత లీలఁబట్టి
కొండతెకట్లుప్రీల్చెడు దండివాలు
గొన్నయింద్రునిపైవాలు గురియఁజొచ్చు

౩౮. పర్వతంబుగతిందల పడియెబ్రోల.
అచటఁగాకుత్థ్సుఁడు కళింగునస్త్రివర్ష
మందుమంగళస్నాతయై యటువెనుకను
విజయలక్ష్మిని జేపట్టి వెలసినాఁడు.

౩౯. యుద్ధభటులప్డు గ్రోలంగనుఅవఁటంచు
గంతదఘ్నంబుగొబ్బరి కల్లుగొనిరి
శత్రురాజులయొకట యశంబునువలె.
ధర్మజయరతుఁడైనయా ధరణివరుఁడు

౪౦. గెలిచియుఁగళింగరాజును వెలయనిలిపి
యొడిచికొనెసిరిదేశంబు విడిచిపెట్టి.
తూర్పుసీమనుజయభేరి తొడరిమ్రోయ
గెలువిడిచినపోఁక తోఁటలుగలట్టి

౪౧. కడలిపట్టెనెచనెరాజ గస్త్యుఁడున్న
దక్షిణసముద్రమునకయి తలఁచిగెలుపు
సైనికస్నానములగజ దానములను
బరిమళముఁజెందికావేరి పాఱఁజూచి

౪౨. శంకపడఁజొచ్చెనదినేత సత్యమపుడు.
గెలుపునందిచ్చగలన్నృపుఁ డలపువొంది
బహుళదూరంబుగడచుట వలనమలయ
పర్వతంబునుపత్యకా భాగమందుఁ

౪౩. గొమ్మలూఁచుహరీత పక్షులకునలరి
సేనతోదిగెమిరియపుఁ జెట్లక్రింద,

గుఱ్ఱపుదడంబు కాలిత్రొక్కుళ్లనలిగి
పైకినెగసినయేలకి పలుకులపొడి

౪౪. గజకటంబుల మెత్తంగఁ గలిసె వలపు.
గజములు మదించి బెదరుచుఁ గాళ్లగొలుసు
లూడ్చుకొనఁగాని మెడపల్పు లీడ్చితమ్ముఁ
గట్టినట్టి గంధపుఁజెట్ల జుట్టుకొన్న

౪౫. త్రాఁచుపాముల చుట్టలఁ ద్రోచి తెగనె!
దక్షిణాయనమగుటచేఁ దగ్గఁగాంతి
వెఱచె సూర్యుండు తమకని విఱ్ఱవీఁగు
పాండ్యరాజులు మచ్చర పడుచుఁబోరి

౪౬. కెదిరి రఘురాజుతో నోడి చెదరిదిశలఁ
గడలిలోఁదామ్రపర్ణి తాఁ గలియుచోటఁ
బుట్టుముత్తెపుఁగోవలు పెట్టికానుక
యాత్మయశమర్పణముచేసి నట్లొసఁగిరి.

౪౭. నిర్విషహ్యపరాక్రముఁ డుర్విభర్త
చందనావృతతటములై స్తనములవలె
యామ్యదిగ్భోగవతికిఁ బొల్పారుచుండు
మలయదుర్దురనగముల వలచినట్లు

౪౮. సౌఖ్యవారాశి నోలాడి సంద్రమునకు
దూరమున భూనితంబమై తోఁచునట్టి
సహ్యపర్వతమును దాటి చనియె నవల.
పశ్చిమము గెల్వను త్సాహ పటిమ వొడమి

౪౯. నడుచురఘురాజుసైన్యంబు నకుఁబడమట
దిరిగితోఁచెసముద్రము పరశురాముఁ
డదిమిననువెండిసహ్యంబు నంటినట్లు
రఘుమహారాజవరుచతు రంగబలము

౫౦. ధాటికినిగేరళస్త్రీలు దౌడువాఱ
సొమ్ములూడ్చుచుఱేఁగిన దుమ్మువోయి
ముంగురులనంటికుంకపు బొట్టుఁబెట్టె.
త్రోవలోమురళానదీ తోయములను

౫౧. మిగులఁజల్లఁదనంబొంది మొగలిపూల
వాసనలుదోఁచివీచెడు వాయుగతుల
భటులకవచంబులెఱుఁగకే పరిమళించె.
కదలిశ్రీతాళపాకులు గాలివలనఁ

౫౨. గూర్చుధ్వనికంటె గుఱ్ఱాలకుథవసనము
లెగిరిపడుచునుజేసె మఱెక్కువధ్వని.
చెదరుకరులఁగట్టఁగనీఁత మొదళులకును
జెవులమదధారజాఱికా లువలుగట్ట

౫౩. ముసురుకొనియెనుగటముల భసలజాతి
పోఁగనొల్లకపున్నాగ పుష్పములకు.
పరశురామునకడలుచు ధరణినొసఁగి
నట్టియాపశ్చిమసముద్రుఁ డవనిపతికి

౫౪. నాదెసఁగలరాజులచేతి మీఁదుగాను
గానుకలువెట్టెఁగంపంబు గడలుకొనఁగ.

ధవళకాంతులసీను దంతములతోడ
రఘుమహారాజుగజములు రాయవ్రాయఁ

౫౫. చిత్రకూటాద్రితటముల జైత్రమహిమ
గెలుపుకంబంబువలెనదె నిలిచెనచట.
తత్త్వవిజ్ఞానమునయోగి తలకుఁజొచ్చి
యింద్రియపుశత్రులంగెల్వ నెంచుమాడ్కిఁ

౫౬. వారశీకులనోడింపఁ బ్రతినపట్టి
నేలత్రోవనెతర్లెను నేలతేఁడు
కమలములుపెంపుచెందన కాలమేఘ
మప్పుడేపుట్టిలేయెండఁ గప్పునట్లు

౫౭. తల్లజుఁడుయవనస్త్రీల కల్లువలచు
మోముదమ్ములనసహించి మోహరమున
వారిపెనిమిట్లుదాఁకిన బాఱఁద్రోలె.
తురగబలములపడమటి తురకలెల్లఁ

౫౮. గదలియెదురంగఁదుముల సంగ్రామమయ్యె.
వింటిటంకారములఁదప్ప వీరభటులు
తెలియరైరివైరులదుమ్ము చెలఁగితేఁగ.
ధరణిపాలుండుభల్లాయు ధముననలుక

౫౯. మీసములగడ్డములపసి మించుగ్రక్కఁ
చెనసెనాయుద్ధభూమి సాయిబులతలలు
తేనెటీఁగలుమూఁగిన తెఱలవలెను.
చావమిగిలినసాహెబుల్ " సాబ్సలాము.

౬౦. శరణనం" గనెపొగాలు చక్కఁదీసి
కరుణక్షమియించెరఘురాజు ఘనతవారి
సజ్జనులయెడఁవినయాన శాంతిపడదె?
రఘుమహారాజుసైనికుల్ ప్రమదమొంది

౬౧. ద్రాక్షపందిళ్లక్రిందఁ జర్మములమీఁద
ద్రాక్షమధువులుగ్రోలి యుద్ధశ్రమంబు
దీర్చికొనినిదురించిరి తృప్తిమీఱ.
జలములనుబీల్పఁగానంశువులబలిమిని

౬౨. సూర్యుఁడుత్తరదిశకేగు చొప్పునన్ నృ
పాలుఁడస్త్రబలంబునఁ బరకుపతుల
బిలుకుమాఱ్వంగవెడలెఁ గౌబేరదిశకు.
సడలబడలికరఘువు నశ్వంబులపుడు

౬౩. సింధునదితీరమునఁబొర్లి చివుకలేచి
కుంకుమపుఁబూవుమూఁపుల గుబురుకొనఁగ
నించుకంతయొడల్ విదిలించుకొనియె.
దీప్తియేమనిచెప్పనా దిక్కనందు

౬౪. రఘుమహారాజుకలన భర్తలనుజంపఁ
గందెఁజెంపలుహూణుల కాంతలకును.
పోరికాంభోజరాజులీ శూరుతోడ
సింధురముకొల్పునూడుగు చెట్లవలెను

౬౫. బొందిరెయోటమికోసల భూమిపతికి
నపరిమితధనరాసులు నశ్వతతులు

నదరుగానంపుకొనిరివి నమ్రులగుచు;
రఘుమహారాజుపడఁడ గర్వంబుదాన.

౭౭. తలఁచిరఘురాజుసార్వతి తండ్రియైన
మలలతేనిమీఁదఁదురంగ మములతోడ
నెక్కి-గైరికధాతువు లెగసిపయికి
గౌరిజవెంబడిఁగొండల పెరుగుదెల్ప

౭౮. సమబలంబులుసింహముల్ దమదుగుహలఁ
బండుకొనిసైన్యకలకల ధ్వనులువినుచు
వెనుకఁజూచినవేకాని వెఱచిపోవు.
గంగపైనుండివీతెంచు గాలికతన

౭౯. మంచిగాభుజపత్రముల్ మరమరమనె.
వెదురుబొంగులుకీచుగా విసిరియులినె.
రఘుమహారాజునకివన్ని ప్రమదమొసఁగె.
మునుపుకస్తూరిమృగములుం డినవిగానఁ

౮౦. జాలఁగస్తూరివలచుపె న్త్రాలభటులు
నిదురవోయిరిసురపొన్న నీడలందు.
సరళవృక్షంబులకుఁగట్టఁ బరఁగుద్విరద
పజ్క్తి-లోమెడగొలుసులం బ్రతిఫలించి

౮౧. యతులమహిమజ్యోతిష్మతీ లతలువెలుఁగ
రఘుమహారాజునకచటి రాత్రులందుఁ
జమురువోయనిదీపాల చాలుపయ్యె.
సేనవెళ్లినపిమ్మట నేనుఁగుగమి

౭౧. సరపణులయొంపిడిగంట్లఁ జక్కఁజూచి
దేవదారుతరువులందుఁ ద్రోవఁజనుచు
నెఱఁగిరికిరాతులేనుంగు లెంతయెత్తొ
రాజునకుసప్తగణముల కాజియచట

౭౨. జరిగిబిండివాలశర పాషాణతతుల
తోడభీకరముగవహ్ని తోఁచెఁగడల.
ఉద్దిలేనట్టిభూపుఁడీ యుద్ధమందు
నుత్సవంబునుబోఁగొట్టె నుత్సవులకుఁ

౭౩. గిన్నరులచేతనీజయ కీర్తులపుడు
చెవులకింపుగాగానంబు సేయఁబడియె.
కొండమీఁదిధనంబెల్లఁ గొంచువారు
గానుకిచ్చిరిరఘురాజు కరుణవడసి.

౭౪. పుడమితేనిబలంబెల్ల నోడిసెనద్రి
కొండధనమెల్లఁజేరె రఘుక్షితిపతి
సుకరముగఁదెల్సికొనిరిటు లొకరినొకరు.
ఎదురులేనియశస్సు నయ్యోడలనిల్పి

౭౫. వెనుకరావణుచేముందు వెనుకలాఁపఁ
బడినకైలాసమేగుటే పరువటంచు
గుణమునిరసించిరఘురాజు కొండదిగియె.
దాఁటిలౌహిత్యనదిరఘు ధరణివరుఁడు

౭౬. చొచ్చెసైన్యంబుతోడఁ బ్రాగ్జ్యోతిషంబు.
కరులఁగాలాగరుతరులఁ గట్టివేయ

నీడ్పులకునిలఁజాలక యిలకునొఱిగెఁ;
దలఁకెఁబ్రాగ్జ్యోతిషాధీశ్వ రులమనములు.

౭౭. రఘుమహారాజుసేనా పరాగమునను
దివిభువులనునిర్వృష్టి దుర్దినముగాఁగ
నచటిరాజులుభయపడి రట్టివారు
వెంటనేనమ్రులైరన వింతయేల?

౭౮. సరవితోఁగామరూప దేశములరాజు
నింద్రువిక్రమమునకంటె నెక్కుడుగల
రఘువునకొసంగిభజియించి రాజవరుల
మున్నుతానుగెల్చిన గజములగములనె.

౭౯. రఘుమహారాజుదివ్య చరణపునీడ
స్వర్ణపీఠాధిదేవిఁగాఁ బరిగణించి
రత్నపుష్పోపహార మర్చనముచేసె.
ఇట్లురఘురాజుదిక్కుల నెల్లగెల్చి

౮౦. రథపరాగంబునంబర రాజవరుల
తలలగొడుగులులేకుండఁ దానెకప్పి
ధారుణిఁగొనియేకాతప వారణముగఁ
దిరిగెవెనుకకుముదమునఁ బురమువైపు.

౮౧. నగరమునుజేరిపైనఁ గొన్నాళ్లుగడువ
సర్వభూభారమునుమ్రోచు శక్తిఁదెలుపు
విశ్వజిన్నామయాగంబు వెలయఁజేసి
రఘుమహారాజుశ్రుతుల శాస్త్రములత్రోవఁ

౮౨. గలధనంబెల్లదక్షిణ గానొసంగె.
సజ్జనులుగడియింతురు జలదమువలెఁ
జెడనిసత్పాత్రదానంబు చేయుకొఱకె.
సార్వభౌమపదుండు యజ్ఞంబుముగియ

౮౩. నోటువొందిననృపుల బహూకరించి
మంత్రితోఁగూడివారల మతులు తేర్చి
చిరవియోగినులయినతత్స్త్రీలఁదలఁచి
వారివారిపురంబుల వైపులకును

౮౪. జనఁగఁగాకుత్స్థుఁడతిదయ ననుమతించె.

చ॥ కలశముఛత్రముంధ్వజము గాఁగనుబట్టు
నృపార్హరేఖికల్। గలిగిప్రసాదలభ్యము
గుత్మ్యావరుపద్వనజద్వయంబుపైఁ। దల
లిడిమ్రొక్కిరా నృపులు తచ్ఛిఖలందలి
పూలతేనెలం। గలిసినకాలివ్రేళ్లుకడు గా
రములయ్యెను రాజమౌళికిన్॥

తే॥ గీ॥ తొంటికవులయూహ ధోరణులిప్పటి
వారికెల్లఁదేటపఱుపఁగోరి
దీనిఁదెనుఁగుఁజేయఁ దివిరితిగైకొండు
వావిలాలవాసుదేవశాస్త్రి॥



# పంచమసర్గము.



విశ్వజిత్తనుయజ్ఞంబు వెలయఁజేసి
మిగులు లేకుండసర్వస్వ మొగినొసంగి
రాజిలుచునున్నరఘుమహా రాజునపుడు
చాలవరతంతుఋషితోడ శ్రద్ధతోడఁ

౨. జదివిపదునాల్గువిద్యలు తుదకుఁగౌత్సుఁ
డింపుగగురుదక్షిణను యాచింపవచ్చె.
దానమొసఁగుటస్వర్ణపా త్రములఁగూడఁ
బాపహాచరిత్రుఁడామహీ పాలవరుఁడు

3. మట్టిముంతలోనర్ఘ్యంబు పెట్టితెచ్చి
శ్రుతివిధానముచొప్పున నతిథిగుణము
లెనయుకౌత్సమునీంద్రుని నెదురుకొనియె.
శాస్త్రిమర్యాదదెలిసి సత్ప్రావరుండు

౪. మానధనవచ్ఛిఖామణి మానిచంద్రు
నుచితపీఠంమీఁదఁగూ ర్చుండవేఁడి
వేవిధంబులనర్చించి విధిసరణిని
గోరిబద్ధాంజలియగుచుఁ జేరిపలికె.

౫. "జనులుసూర్యునివలనఁజేత ననుబడయు
విధముగానెగురునివల్ల విద్యనీకు
దొరకెనాతండుక్షేమమే దొడ్డమాంత్రి
కాగ్రణీకాత్సవర్యకు శాగ్రబుద్ధి!

౬. వారుత్రికరణశుద్ధిగా గారవించు
జపతపస్సులకింద్రుండు సాహసమున
విఘ్నములొనర్పఁగాఁగదు వెఱచుఁగాదె!
పాందులమరిచియెన్నెన్నొ పాట్లువడుచుఁ

౭. గనినబిడ్డలవలెఁబెంచు కొనుటమీకు
శ్రమముపోఁగొట్టఁగల్గునా శ్రమమహీరు
హములులెస్సలెతప్పి వాత్యాదులకును?
తమకునభిషేకములఁబిత్రృ తర్పణములఁ

౮. బనికివచ్చుచుఁజాలంగఁ బరిగెగింజ
లేరికూర్చినదానిలో నృపునియార్వ
పాలిరాసులయిసుక దిబ్బలుగలట్టి
తీర్థజలములుసర్వదా తేఱియున్నె?

౯. ప్రేమనదలింపకుండంగ ఋషులుతమ్ము
యాగసాధనదర్భల నైననమలి
పాములకునందరాకుండ వారితొడల
పయినిబొడ్డుచేరులఁబెట్టి పండుకొనెడు

౧౦. పదిదినంబులజింకలు పదిలమొకొ?
వేళకేతెంచునతిథుల విందుగొల్పి

మీరుభుజియింపఁబోడమునీ వారముఖ్య
ధాన్యములనూళ్లపశువులు దాఁటివచ్చి
౧౧. మేయకుండునుగాదెయ మేయధిషణ?
దయఁగఅపివిద్యలనువర తంతుఋషులు
మీకునసుమతియిచ్చిరా మేకొనంగ
నాశ్రమశ్రేష్ఠమగు గృహస్థాశ్రమంబు?
౧౨. ఇదెకదామీకుఁదగుకాల మదిగ్రహింప!
పూజ్యులగుమీరురాఁగానె బులుపులేదు
మీరెవచ్చితిరోమరి మీగురువులు
పంపవచ్చితిరోకాని వచ్చుకార్య
౧౩. మేదొసెలవిండియదిసేయ కితరమొల్ల."
పాద్యమిడినట్టిమృణ్మయ పాత్రవలనఁ
జేతదమ్మిడిలేకుండఁ జెల్లుపెట్టి
రిక్తహస్తుఁడైయున్నట్టి నృపునిజూడ
౧౪. లాముసీశ్వరుఁడెఱిఁగి నిరాశపడియు.
నతనియౌదార్యవాక్యము లబ్బెవించు
బెట్టుపసజూడఁగోరితా నిట్టులనియె.
" కలవిధంబులఁగుశలంబు గలదుమాకు.
౧౫. రాజవీవుండఁగాఁ గీడురా వెఱవదె
సూర్యుఁడుండంగఁజీకటి జొచ్చునెట్లు?
ఓ మహాభాగపూజ్యుల కొదిఁగిభక్తి
గూర్చుటలుపుబ్బెమున్నెమీ కులమునందు;

౧౬. నందుముందటివారికీ వందవిందుఁ;
గానికాలంబుమించిన పైననేను
వచ్చియాచించుటకుఁజింత పడకయెట్లు?
కలధనంబెల్లసత్పురుషులకొసంగి

౧౭. దేహమాత్రాననిలుచునీ దివ్యమహిమ
ఋషులువెన్నులురాల్పుకో నెసఁగునెవరి
దంట్లలాఁగుననొప్పెడుఁ దథ్యముగను.
సార్వభౌముఁడవైయిచ్చి సర్వధనము

౧౮. నిర్ధనత్వముపొందుట నీకుమేలె?
సురలుక్రోలంగఁదగ్గుచం దురుడుతాన
వెండిశుక్లపక్షంబున వృద్ధికాఁడె?
కోర్కెగురుదక్షిణకుమించి కోరఁబోను;

౧౯. దాతమరియొకర్నింజూడఁ దగునునాకు;
స్వస్తినీకగుఁగావుతఁ; జాతకమ్ము
శారదాబ్దజలంబును గోరఁజనునె?"
అనుచులేచిపోవంగాను యత్నపడెడు

౨౦. నతనివరతంతుశిష్యుని నడ్డగించి
రఘుమహారాజు "విద్వాంసబ్రహ్మచారి
యేదిగురునకుదక్షిణ యిత్తువ"నఁగ
యాగముయథావిధినిజేసి యాశ్రమాది

౨౧. రక్షకుండయ్యునింత గర్వమునులేవి
క్షితివరునితోడఁగౌత్సుండు చెప్పఁదొడఁగె

"విద్యలన్ని ముగించిన వెనుక నేను
గురువుతో గురుదక్షిణఁ గొమ్మనంగ
౨౨. జాలశుశ్రూష చేసితి చాలుననియెఁ,
గాని బలవంత పెట్టఁగా నేను గోప
మినుమడింపదరిద్రుఁడ ననియెఱింగి
చదువు చెప్పినవిద్యల సంఖ్యఁ దలఁచి
౨౩. కొంచురమ్మనెఁ బదునాల్గు కోట్లధనము.
నన్నుఁ బూజించుకుమ్మర గిన్నె మొదటఁ
జెప్పెఁ బ్రభుశబ్దమాత్ర విశిష్టుఁడవని;
నాకువలసినరొక్కమా నాల్గుకోట్లు;
౨౪. కనుకయాచింపనిన్నునా మనసురాదు."
అనుచుఁ గౌత్సుండు వలుకఁగా నమృతసూతి
కాంతిగ్రేణించుముఖకాంతి గల్గిపాప
మన్నమాటయెఱుంగని యవనిపాలుఁ
౨౫. డా మునీశ్వరుతో నిట్టు లనియె మఱల.
"శాస్త్రపారంగతుండైన సంయమీంద్రుఁ
డర్థిగురుదక్షిణకు రఘు పార్థివునిని
గోరిపొందకయింకొరుఁ జేరెననెడు
౨౬. నిందపాల్పఱుపకువయ్య నిందుదయను.
ఓయి పూజార్హ మాయింట నోర్పుమీఱ
నగ్నిహోత్రాలగదిఁ జతుర్థాగ్నివలెను
బ్రేమఁ గడిపితి రా నాళ్లు రెండుమూఁడు,

౨౭. మీఁదెలమినిల్పయత్నంబు చేయువాఁడ."
అనుచుఁ గౌత్సుండు ప్రియమొంది యవనివరుని
ప్రతినవ్యర్థంబుకాకుండ వరమొసంగి
సమ్మతించెనునిల్వఁగా. క్ష్మావరుఁడును

౨౮. బుడమిధనమెల్లముందె కొల్లడినదంచుఁ
దలఁచెధనముఁగుబేరుని వలనఁబడయ.
హరివసిష్ఠుమంత్రోదక ప్రోక్షణమున
భూవరుని తేరుకొండ సముద్రభాగ

౨౯. మాకసంబనకయ పోవునడ్డులేక
గాడ్పులనుకూలమైన మేఘంబుకరణి.
రఘుమహారాజు సామంతరాజునువలెఁ
దాఁగుబేరునిగెల్వఁగాఁ దమకపడుచు

౩౦. వీరగుణమొప్పగోధూళి వేళయందు
నస్త్రములతోడరథమెక్కి యటఁబరుండి
వేఁకువను లేచిపురివీడి వెళ్లునపుడు
ధనగృహంబునఁగాపున్న జనులువచ్చి

౩౧. "మనసువర్ణగృహంబున మనుజనాథ
కనకవర్షంబుగురిసెను గనుమువచ్చి"
యనుచునాశ్చర్యమగ్నులై మనవిచేయఁ;
గదలిచనిమూలకొట్టులోఁ గాంచెరాజు

౩౨. ప్రతినతెలిసికుబేరుఁడే పంపినట్టి
వజ్రధారనుదెగఁగొట్టఁ బడ్డమేరు

శిఖరమును బోలికనక రాశినిముదమున.
కౌత్సుఁడడిగినవిత్తము కంటె వేయి
౩౩. మడుఁగు లెక్కువయైనను మనుజనాథుఁ
డంతబంగారుకుప్పయు నతనికిచ్చె.
అపుడయోధ్యాపురస్థులు నృపమునులమ
హానుభావతలకు ముదమందినారు.
౩౪. గురువుకోరినకంటెను గోరనట్టి
యాచకునికోరిక్కధికమిఁ జూచునట్టి
వారలనుజూచి సంతోషపడుటయరుదె.
ప్రీతచేతస్కుఁడై కౌత్స ఋషిధనంబు
౩౫. నూల్లకొలఁదిగగోడిగల్ నూఱులొట్టి
పిట్టలధికశ్రమన్ మోచు నట్టుచేసి
వంగియొదిఁగెడు రఘురాజ వరుని మేను
చేతనిమురుచునిట్టులు చెప్పఁజొచ్చె.
౩౬. "నాల్గువిధములద్రవ్యంబు నడుపఁగల్గు
రాజులకు ధాత్రిధనమిఁగి సాజమగును.
వింతగానాకసము హేమ వృష్టిఁగురిసె
నీమహాత్మ్యమెన్నంగ నేనుజాల.
౩౭. అన్నియైశ్వర్యములుగల వెన్ననీకుఁ
గానఁబుత్రవరంబున కంటెనన్య
వరమొసంగుటపునరుక్తి భావమొందు.
నిన్నుఁగనితొల్లిమీతండ్రి గన్నముదముఁ

౩౮. బొందుమీనీవుసుగుణవ త్పుత్రుఁబడసి.
నిర్విలిప్తతనిట్టు లాశీర్వదించి
కౌత్సుఁడేగెనువరతంతు కడకువడిగ.
సూర్యునుదయంబువలన వస్తువులు తేజ

౩౯. మందినట్టులురఘురాజు నతనిదీవ
నలప్రభావంబునంబొందె నందనునిని.
రాజుపట్టపుదేవేరి ప్రసవమైకు
మారుఁగాంచెనుమారకు మారసముని

౪౦. బ్రాహ్మవేళను, రఘుమహా రాజుఁదలఁచి
యజముహూర్తంబునంబుట్టి నాఁడుగనుకఁ
పేరుబెట్టెనజుండని వ్రేలవ్రాసి.
తండ్రిపోలికకొడుకున్నతత్వమందు

౪౧. శౌర్యసౌందర్యములనెందు సాటిలేను.
దీపమునవెలిఁగించిన దీపమెపుడు
దీప్తిలోఁదగ్గునె మొదటి దీపకళకు?
గురులచేనందిశ్రుతిశాస్త్ర పరిచయంబు

౪౨. యౌవనావిర్భవంబున నలరుమీఱు
నజునిఁజేపట్టఁగోరి రాజ్యరమతండ్రి
యనుమతికిఁగాచియుండెఁ గన్యకవిధమున
ననఁగయువరాజపదమున కర్హుఁడయ్యె.

౪౩. అంతలోనెవిదర్భభూ కాంతుఁడనఁగ
నెసఁగుభోజుఁడుతనచెల్లె లిందుమతికిఁ

బరిణయముచేయఁగాస్వయం వరముసాటి
యజునినెటులైనరప్పింప నాత్మఁగోరి

౪౪. నమ్మకపుమాతరఘురాజు నకునుబంపె.
రాఁగరఘురాజుమాత గౌరవముచేసి
కోరుకొనఁదగువీయము గూడెననుచుఁ
బెండ్లికెదిగినకొడుకును బ్రేముడించి

౪౫. దండుతోఁబుత్రుఁబంపె వైదర్భపురికి.
త్రోవనజరాజుభోగమ స్తోకమయ్యె.
భోజనిర్మితపటగృహ రాజిదిగుచుఁ
బట్టణంబులదొరికెడు వస్తువులను

౪౬. గొంచునుపవనంబుల విహరించుచుండెఁ
గొఱఁతలేకుండవస్తువుల్ కూర్పఁబడుట.
చాలదూరంబుగడిచి యజప్రవరుఁడు
ధూళిగ్రమ్మినతెకెరములల్ తొట్రువడఁగ

౪౭. బడలికలుదీర్చుకోఁజల్ల వాయువందు
దిగియొసేనతోనర్మదా తీరమందుఁ
జీమమాఅనికానుగు చెట్లక్రింద.
గండుతుమ్మెదలప్పుడు పిండుగట్టి

౪౮. యేటినీటిపైప్రమోయంగ నేనుఁగొకటి
మునిఁగెఁగాఁబోలు ననుకొంచుమూఁగిచూడ
నంతలోవన్యగజమొండు ప్రహదము వెడలెఁ
దడిసిచెంపలమదజల ముడిగిమెఱయ.

౪౯. తెలియవచ్చెఁ గజము నీట దిగకమునుపు
ఋక్షవద్గిరిశిఖరితో రేసిరాసి
దంతములు వప్రఖేలనోద్యత్ప్రవృత్తిఁ
దిరిగినట్టులు వానిపైఁ దేఁటపఱుప

౫౦. నల్లనిడుపాటిగీఱలు నక్కగంట్లు.
ఇంక గైరిక చిహ్నంబు లేటగలిసె
ముడుచుచును జాచుచును దొండమునవలీల
నాయడవియేనుఁగటు హెచ్చి యలలు వ్రచ్చి

౫౧. గట్టుమీఁదికి నృపుకరుల్ గట్టఁబడ్డ
ప్రాఁకులను బడఁ గొట్టెడు మాడ్కి వచ్చె.
ఆమదేభంబు ముంగాళ్ల కడ్డపడ్డ
నాఁచుతీఁగలతో నొడ్డు నకును దుముక

౫౨. నుండఁగా నెకలు త్లెచ్చె నున్నతముగ.
కడచినడ గొండవలె వచ్చు గజమునకును
మదజలంబోడకుండెను నదినిబొరిలి
నంతసేపును గానియా యవనిపాలు

౫౩. కరులఁ జూడంగ నోడికల్ గట్టసాఁగె.
వలచునే డాకులఱఁటుల పాలవలెను
మదముగార్చెడు కరిఁజూచి బెదరుపొంది
దొరకరులు మావటీండ్రను సరకుఁగొనవు.

౫౪. ఒక్కనాగంబె త్రుటిలోన నుక్కుమిగిలి
దండు నెంతయుఁ దాఁగల గుండు పెట్టె.

బంధములు త్రెంచి గుఱ్ఱముల్ పఱచెఁ గడల,
నిరుసులూడంగఁ దేరులు నిలకుఁగూలె
౫౫. భటులు తమ స్త్రీలఁ గాపుకై పరుగులిడిరి.
కలన నెదిరినఁగాక యే గజముఁగాని
నృపులకును జంపఁదగదను నీతి దెలిసి
యజనృపసుతుండు తనమీఁది కట్టివచ్చు
౫౬. దానికుంభస్థలంబునఁ దాఁకునట్లు
సగము విలువంచి బాణము చక్కనేసె.
తగిలెనో లేదో యేనుఁగు దనము వోయి
యదినిలంబడెఁ గాంతిపూరాంచితముగ
౫౭. దివ్యదేహంబు ధరియించి ధృతిగతించి
దండనాయకులెల్ల వితాకుఁ జెంద.
అల్పమే వానిమహిమంబు కల్పవృక్ష
పుష్పములు వచ్చి యజరాజు ముంచివిడిచె.
౫౮. అంత నాదివ్యపురుషుఁడు దంతకాంతి
పేరురంబున ముత్యాల పేరు వెనుప
వచనచతురిమ వెలయంగఁ బలికెనిట్లు.
"గర్వపడి తొల్లి నేమతంగ ఋషియొక్క
౫౯. శాపమునఁ గంటిమాతంగ జన్మమిట్లు.
నమ్మ ప్రియదర్శనుఁడను గంధర్వరాజు
తనయుఁడను బ్రియంవదుఁడని తనదు పేరు.
నేను వినయమ్ము మైత్రమొక్కఁగా నెమాని